దేశి ప్రచురణ
ప్రథమముద్రణ
ఆగష్టు 1951
రూపాయిపావలా
కళ్యాణీ ప్రెస్,
వి జ య వా డ.



సం పా ద కు లు :
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

## మా తృ క :

దీనికి మాతృక ఫెరెన్స్ మోల్నార్
వ్రాసిన ఒక హంగేరియన్ నాటకం.
దానిని ప్రఖ్యాత నవలారచయిత
పి. జి. వుడ్ హౌస్
"The play is the thing"
అనే పేరుతో ఆంగ్లంలోకి అనువ
దించాడు. ఆ అనువాదం ఆధారం
గాయీ 'నాటకం' వ్రాయబడింది.

1951 మేలో తెనాలిలో జరిగిన ఆంధ్రనాటకకళాపరిషత్తు
నాటక పోటీలలో 'రచనకూ, ప్రదర్శనకూ'
ప్రథమ బహుమతి పొందిన నాటకం.

---

ఉదయినీ థియేటర్సు & రాఘవ కళాకేంద్రం వారు
ఆంధ్రనాటకకళాపరిషత్తు నాటకపోటీలలో ప్రదర్శించినప్పుడు.

— పాత్రధారులు. —

రఘుపతి : శ్రీ పి. రామచంద్రకాశ్యప
రామానుజం శ్రీ కె. వెంకటేశ్వరరావు
కామరాజు శ్రీ కె. వి. యస్. శర్మ
మధు శ్రీ బి. రవీంద్రనాథ్
శివశంకరం శ్రీ మాచినేని వెంకటేశ్వరరావు
పెరుమాళ్ళు శ్రీ విన్నకోట రామన్న పంతులు
ఊర్వశి శ్రీమతి ఆర్. నిర్మల

ప్రొడ్యూసర్ :
శ్రీ డి. వి. నరసరాజు

కృతజ్ఞత :
యీనాటకాన్ని విజయవంతంగా ప్రదర్శించడంలో నాతో సహకరించిన ఉదయినీ థియేటర్స్ & రాఘవ కళా కేంద్రం సభ్యులకు నా కృతజ్ఞత.
రచయిత.

# నా ట కం

## [ఒకటవ రంగం]

[తెర లేచేసరికి స్టేజీ చీకటిగా వుంటుంది. వెనుక రెండు కిటికీలు ఒకద్వారం వుంటయ్. వాటిగుండా కొంచెం గుడ్డివెలుతురు వస్తూవుంటుంది. ఆ చీకటి గదిలో మూడు మానవాకారాల నీడలు కనిస్తయ్. వెలిగించిన మూడు సిగరెట్లు చీకటిలో మినుకు మినుకుమంటూంటయ్. చాలాసేపు నిశబ్దం! విసుగు పుట్టేటంతసేపు నిశబ్దం! ఏదో ప్రమాదం జరిగిందని ప్రేక్షకులు అనుమానించబోయేముందు ఒక మనిషిగొంతుక వినిపిస్తుంది]

గొంతుక: అరేయ్, రఘుపతీ! నువ్వాగనుక వరసనే 60 సెకండ్లసేపు మాట్లాడకుండా వున్నావంటే, ఏదోప్రళయం వుందన్నమాటే.

[ఒక మానవాకారం కదలి గోడవైపు వెళుతుంది. స్విచ్‌వేసిన చప్పుడు; వెంటనే స్టేజీమీద లైట్లు వెలుగుతై. Modern furniture తో అలంకరించబడిన ఒక పెద్దగది. ఒకమంచం, టేబులు, కుర్చీలు, Dressing table, coat stand యింకా మామూలుగా కావలసిన పరికరాలు అన్నీవుంటాయ్.]

[లైటువేసిన మనిషిపేరు రామానుజం. మిగతా వాళ్లిద్దరూ రఘుపతి, మధు. రామానుజం- రఘుపతి-యిద్దరూ దాదాపు సమాన వయస్కులే. రఘుపతి కొంచెం చిన్నవాడుగా కనిపిస్తాడు. మధు యువకుడు. భావకవి లక్షణాలుంటాయ్. పగటికలలు కనేరకం; అందమైనవాడు]

రామా : ఏమిట్రా రఘూ ! ఆలోచిస్తున్నావ్ ?

రఘు : ఒక నాటకాన్ని ప్రారంభించడం ఎంతకష్టమైన కార్యమా అని ఆలోచిస్తున్నాను. ప్రధాన పాత్రల్ని పరిచయం చేయడం అనేది మహా గడ్డు సమస్య సుమా!

మధు : అవును. చాలా కష్టమనుకుంటాను.

రఘు : కష్టమని నెమ్మదిగా అంటావేం ! పేగులు తెగిపోతయ్ ! తెరలేస్తుంది. హాలంతా నిశ్శబ్దం. పాత్రధారులు స్టేజి మీదకొస్తారు. తరువాత ? అక్కడే వస్తుంది చిక్కు. ఆ పాత్రలు ఎవరో, ఎందుకొచ్చారో ప్రేక్షకులకి అర్థమయ్యేటప్పటికి, అధమపక్షం అరగంటయినా పడుతుంది.

రామా : అరేయ్! నీలాంటివాణ్ణి నేనెక్కడా చూడలేదురా ! ఒక్క క్షణంసేపన్నా మరచిపోలేవురా ఆ పాడు నాటకాల గొడవ!

రఘు: అసంభవం! అందుకనేనేనింతగొప్ప నాటకకర్తనికాగలిగాను

రామా : ఎప్పుడూ ఏదో వాగు డుంటేతప్ప నీకు తృప్తివుండదు. జీవితంలో నాటకాలగొడవేగాని మరేంలేమా ?

రఘు : లేదు ! జీవితమే నాటకం ! నాటకమే జీవితం ! నాటకాలు రానేవాడికి తెలుస్తుందోయ్ దానిమజా ! ప్రపంచ ప్రఖ్యాత నాటకకర్త 'అల్ఫాన్స్‌డాడే' తన 'స్వీయచరిత్ర'లో ఏం వ్రాశాడో తెలుసా ? చావబోతున్న తనతండ్రి మంచం పక్కన నుంచుంటే, అతనికి అనిపించిందట, "అరెరె ! స్టేజిమీదయితే యీసీనుఎంతబాగా రక్తికడుతుందిరా"అని.

రామా : ఇక చాల్లే ఆపవోయ్! ఎవడన్నా వింటే నవ్వులాడు.

రఘు : మరి నాటక కళ అంటే ఏమనుకున్నావ్? అసలు నాటక రచనే బుర్ర బద్దలయ్యేపని. అందులో నాటకాన్ని ప్రారంభించడం! అబ్బో- ఉదాహరణకి యీ సీనే వుందనుకో! మన ముగ్గురం వున్నాం. తెరలేస్తుంది. ఇది ఒక పెద్ద హోటల్లో గది అని, మనం ఫలానా వాళ్లమనీ, ఫలానా పనిమీద వచ్చామనీ ప్రేక్షకులకి తెలీడ మెలాగ? ఇదే ఒక నాటకంలో సీనయితే, మనం ముగ్గురం, ఏ అరగంట సేపో, ఏదో అర్థంలేని సంభాషణ మాట్లాడ్డం, యీలోపల ఆడియన్సులో విసుగుదల, దగ్గులు, సకిలింపులూ, కుర్చీలు జరపడం—నానా హంగామా! యిదంతా అయిన తరువాత గాని వాళ్ల కర్థంగాదు మనమెవరమో,ఎందుకొచ్చామో!

రామా : అయితే యిప్పుడు నువ్వనేదేమిటిరా?

రఘు : ఆ అనవసరపు కాలయాపనలేకుండా Directగా మనల్ని మనమే పరిచయం చేసేసుకుంటే ఎంత Simpleగా వుంటుంది. [అని లేచి ప్రేక్షకుల నుద్దేశించి] సోదర, సోదరీమణులారా! నమస్కారం! మేం ముగ్గురం ఒక ముఖ్యమైన పనిమీద ఇంతకుముందే మద్రాసు వచ్చి యీ హోటల్లో మకాం చేశాం. రాగానే పంచభక్ష్య పరమాన్నాలతో సుష్టుగా భోంచేశాం. నా పేరు రఘుపతి! ఆంధ్ర దేశంలో ప్రఖ్యాతిచెందిన నాటకకర్తని. ఆంధ్ర నాటక రంగంతో నాకు పాతికేళ్ళ పరిచయం వుంది. నేను చాలా

నాటకాలురాశాను. అయితేఆర్జించింది ఆపే లేదనుకోండి.

రామా : [లేచి ముందుకు వచ్చి] సోదర, సోదరీమణులారా! నా పేరు రామానుజం. నేనూ కొన్ని నాటకాలు రాశాను. కాని ముఖ్యంగా మావాడు రాసిన నాటకాలు ప్రదర్శించ డమే నా పని. అసలు వాడు నాటకాలు వ్రాయడానికే పుట్టాడనీ, నేను ఆ నాటకాలు ప్రదర్శించడానికే పుట్టాననీ- మా దృఢనమ్మకం. ఆంధ్ర నాటకరంగం మీద మా కాంబినేషన్‌లాంటి కాంబినేషన్ లేదంటే నమ్మండి.

రఘు : మీ కేవిధమయిన చరిత్రాత్మక, పౌరాణిక, సాంఘిక నాటకములు గాని, నాటికలు గాని కావలసిననూ apply to రఘుపతి & రామానుజం Company Limited. Satisfaction Guaranteed.

రామా : యిదీ మా యిద్దరి సంగతి !....

రఘు : యిక మా వాడి సంగతి [అని మధుని చూపిస్తాడు]

మధు : [కొంచెం జంకుతూ లేచి] సోదర, సోదరీమణులారా ! నాపేరుమధు-వయసు 25 మొన్ననేవెళ్ళినై. నేనుపాడతాను.

రఘు : చాలా బాగా పాడతాడు !

మధు : పాటలుగూడా రాస్తాను. మా బాబాయ్ [రఘుపతిని చూపుతూ] మొన్ననే కొత్తగా వ్రాసిన నృత్యనాటికకు నేనే పాటలు వ్రాసింది. సంగీత దర్శకత్వంకూడా నాదే. అది నా ప్రథమ ప్రయత్నం ! నాలో ఏమన్నా ప్రతిభ

వుంటే, అది వీరి చలవే. వీరిద్దరూ లేకపోతే, నా దేముంది. అనాథుణ్ణి! నాకు తల్లి,దండ్రులులేరు, పేరుప్రఖ్యాతులు లేవు. ఆస్థిపాస్తులు అసలే లేవు.

రఘు : కాని అన్నిటినీ మించిన అందం వుంది, యౌవనముంది!

రామా : చచ్చేటంత తెలివితేటలున్నాయ్!!

మధు : నేను అందాన్ని ప్రేమిస్తాను-ముఖ్యంగా ఆడవాళ్లలో! ఉదాహరణకి-ప్రస్తుతం యీ వూళ్లో ప్రఖ్యాత నర్తకి-'ఊర్వశి' అనే అమ్మాయిని ప్రేమిస్తున్నాను.

రఘు : ఆసంగతి వేరే చెప్పాలబోయ్. ఆమాత్రం తెలీదూ వాళ్లకి? అందం, కవిత్వం, యవ్వనం, సంగీతం- యిన్నిలక్షణాలూ కల పురుషుడు అప్సరసన్ని ప్రేమించడం మన దేశంలో అనాదినుంచీ వస్తున్న ఆచారం!

మధు : అవును.

రఘు : [లేచి] ఏమయితేనేం, యిదీ మా సంగతి. వాతావరణం ప్రశాంతంగా వుంది. చక్కగా వెన్నెల కాస్తోంది. చల్లగా సముద్రపుగాలి వీస్తోంది. ఆకాశం నిర్మలంగా వుంది. సముద్రం విశాలంగా వుంది.....యిలా నాటకం ప్రారంభిస్తే ఎంత Simple గా వుందో చూడు!

రామా : ఏడిసినట్టుంటుంది! యిలాగయితే, ప్రతివెధవా తెల్లారే సరికి ఒక నాటకం రాసి కూర్చుంటాడు.

రఘు : రాయనియ్! ఏం పోయింది....అహఁ! అసలు నే ననేది- యీ టెక్నిక్ చూడు ఎంత Simpleగా వుందో!

రామా : ఓరి నీ టెక్నిక్ మండిపోను- యికనన్నా ఆపరా నీనాట కాల గొడవ! చస్తునాం.

రఘు : నువ్వేమన్నాఅను! యింతఅమోఘమైనటెక్నిక్ కనిపెట్టినందుకు, యీరోజు చాలాసుదినం! యివాళతారీఖు 13 గదూ!

రామా : ఆ! ఆదివారం కూడా.

రఘు : అయితే ఏం ?

రామా : కనిపిస్తూనేవుందిగా ఫలితం !

రఘు : అరే! ఆలా ముసలమ్మలా మాట్లాడకు. ఏమిటి నీ చాదస్తం ! వారం, వర్జం, వంకాయపులుసు !

రామా : తెలిసివుండి, ఎవడైనా ఆదివారంనాడు పడమరకు బయలుదేరతాడటరా !

మధు : ఆదివారమైతేనేం, సోమవారమైతేనేం ? అదృష్టమనేది వుండాలిగాని——

రఘు : అసలు ఆదివారం నాకు చాలా Lucky day. (రామానుజంతో) నువ్వు పుట్టిందికూడా ఆదివారంనాడే గదూ !

రామా : అందుకే మనబ్రతుకిల్లా తగలడింది. ఇవాళమటుకి యివాళ చూడు. అన్నీ అపశకునాలే గదా ! బయలుదేరగానే వర్షంవల్ల కొంత ఆలస్యం. దోవలో కారుకింద కుక్కపిల్ల పడింది. అవొక ఆలస్యం ! తీరా అన్నీ గడిచి యిక్కడికి వస్తే, ఎవరున్నారు ? అసలయిన వాళ్లే Absent ! అంతా picnicకి దయచేశారు. అందరితో

పాటు ఊర్వశి కూడా వెళ్లింది. పోనీ యీ రాత్రి కేమైనా తిరుగొస్తుందా అంటే, అదీలేదు. మనమంతా నోరెళ్లబెట్టి చూస్తూ కూచోవాలి. చూశావా ? ఆదివారం అదృష్టం !

రఘు : తెల్లవారేసరికొస్తుంది చూడు, ఊర్వశి !

రామా : తెల్లవారితే సోమవారం గడియ లొచ్చినట్లేగా! ఆదివారం ప్రభావం ఏం తగ్గినట్టు ?

మధు : నా ప్రేయసి కోసం యీ రాత్రంతా నిరీక్షించవలసిందేనా? దారుణం !

రామా : ఆదివారం ప్రభావమోయ్ !

రఘు : మంచయినా, చెడయినా—మనం అనుకోవటంలో వుంది. నే చెబుతా చూడు యివాళ విశేషాలు. మనం బయలు దేరగానే వర్షం వచ్చింది. దుమ్మంతా అణగిపోయి. రోడ్డు శుభ్రమయింది. నెల్లూరులో చక్కగా ఫలహారాలూ, కాఫీ సేవించాం. బయట ఆ చినుకులూ, చల్లగాలీ లేకపోతే ఆ వేడి వేడి కాఫీ అంత రుచిగా పుంటుందీ? ఇక- కుక్క పిల్ల కారుకింద పడిందంటావ్ ? ఇంకానయం. మనిషి పడలేదు—! అది అదృష్టం గదూ ? యిక్కడికి కొంచెం ఆలస్యంగావచ్చాం. అలారావడం ఎంతఅదృష్టం! అసలే ప్రయాణంలోఅలసివచ్చిన మనల్ని మర్యాదకోసం వాగించి చంపడానికి ఎవరూలేరు. మనంహాయిగా విశ్రాంతితీసుకో వచ్చు—పైగా- సుష్టుగాభోంచేశాం. యింకేం కావాలి ?

రామా : నువ్వెన్నైనా చెబుతావులే !

రఘు : ఆఁ– అన్నింటినీ మించిన మరో పెద్ద అదృష్టం వుంది. యీ ప్రక్కగది ఎవరిదో తెలుసా ? ....ఊర్వశిది !

మధు : నిజంగానా బాబాయ్ !

రఘు : ఊఁ! నేను కావాలని ఊర్వశి ప్రక్కగదులు రెండూ reserve చేయిస్తే! యిదంతా అదృష్టంగాక మరేమి టోయ్ ! నీ ఆదివారం అడ్డువచ్చిందా ?

రామా : ఆ అదృష్టం అంతా వాడిది. [మధుని చూపుతూ]

రఘు : వాడిదేమిటోయ్, మన అందరిదీనీ! వాడి ఆనందమే మన ఆనందం! చూడు, ఊర్వశి తిరిగివచ్చి, అమాంతం మనల్ని చూచి, ఎంత ఆనందపడుతుంది ! ఆశ్చర్యంతో ఆనంద పరచడం అదో టెక్నిక్ !

రామా : టెక్నిక్, టెక్నిక్ !

రఘు : ఊర్వశికోసం నేను వ్రాసితెచ్చిన నృత్యనాటిక వుంది గదూ ! అందులో రెండోరంగంలోని ఆ విరహగీతంతో ఆమెకి రేపు ఉదయం మధు మేలుకొలుపు పాడితే ఎంత సంతోషిస్తుంది ఊర్వశి !

రామా : [విసుగుతో] అరేయ్, మూడుగంటలు దాటింది. యిక నైనా నిద్రపోనియ్యరా, నీ పాటలూ, ఆటలూ రేపు చూచు కోవచ్చు.

రఘు : మనం వచ్చామని తెలీకుండా, ఆ విరహగీతం వింటే ఊర్వశి మనసులో ఏమేమి వూహలు రేగుతయ్యో !

మధు : ఒకవేళ మనం వచ్చామని ముందే తెలిస్తే ?

రఘు : ఆ ఏర్పాట్లన్నీ చేసే వుంచారేపోయ్ ! నేవు ఉదయించారా మనం వచ్చిన సంగతి నరయూనవుడికి తెలియకూడదని Butler కి చెప్పేవుంచా ! Butler అంటే సామాన్యుడనుకున్నావేమిటి ? యీ హోటలు ప్రాణం అంతా వాడి చేతిలో వుంది.

మధు : అయితే నేవెళ్లి స్నానంచేసి వస్తా !

రఘు : ఆదేమిట్రా ? హోటలు ప్రాణం అంతా Butler చేతిలో వుంటే, వీడు స్నానం చేసివస్తా నంటాడేమిటి ?

మధు : అదికాదు బాబాయ్ ! ప్రేయసి ఆగమనంకోసం నిరీక్షించే నిర్మల హృదయంలో, ఆ Shower bath కింద అలా నుంచుంటే ఆహాహా ! ఎంత ఆనందంగా వుంటుందను కున్నావ్ ?

రఘు : [నవ్వి] కవి హృదయం! [లేచి దగ్గరకువచ్చి వీపు తట్టుతూ] నువ్వు చాలా అదృష్టవంతుడివిరా నాన్నా! చాలా పైకొస్తావ్ ! పైకిరావడానికి సామాన్యంగా యువ కవు లంతా పడే బాధలూ, కష్టాలూ నీకేమీ లేవు. సునాయాసంగా ఏకష్టం లేకుండా. నిన్ను పైకి తీసుకురావడానికి నీకు అండగా ఒక అఖండ ప్రతిభావంతుడున్నాడు. [కనసు చూపుకుంటూ]

రామా : ఒకడు కాదు. ఇద్దరు !

రఘు : ఏమిటి ?—ఆఁ! మరచిపోయా ! ఇద్దరం ప్రతిభావంతు లున్నాం, నీకేం భయంలేదు. వెళ్లు! చల్లని నీళ్లలో స్నానం

చేసి, వెచ్చని రగ్గు కప్పుకొని, మత్తుగా నిద్రపోయి, మధుర స్వప్నాలు కను నాయనా! జీవితాన్ని ఆనంద మయం చేసుకో!

మధు : [సంతోషంతో] వస్తాను బాబాయ్! [పోబోతాడు]

రఘు : ఆఁ, ఆఁ, మరో విషయం. కాసేపాగితే, యీ ప్రక్క గదిలో నిదురించే దెవరో కొంచెం ఆలోచించుకో.

మధు : [సిగ్గుపడతాడు]

రఘు : అటు ప్రేయసి, యిటు ప్రియుడు. మధ్య ఒక పెద్దగోడ! వియోగం, విరహం! ఓహ్! కవియైనవాడికి ఇంతకన్నా మంచి కథావస్తు వేం గావాలి?

మధు : మరి బాబాయ్, యీ గదిలో నే నొక్కణ్ణేనా పండుకునేది?

రఘు : అవును.

మధు : మరి మీరో?

రఘు . ఆ గదిలో!

మధు : యిద్దరూ?

రఘు : అరేయ్! రఘుపతి & రామానుజం Combination అంటే అవిభాజ్యమైన అపూర్వ సమ్మేళనం. మమ్మల్ని వేరుచేయగలశక్తి యీ ప్రపంచంలోనే లేదు. అదీగాక మేము విడిపోతే లోకాని కెంత నష్టం. నేను నిద్రలో కలవరిస్తాను. నా కలవరింతల్లో కవిత్వముంటుంది—అని అంటారు అంతా! వీడికి నిద్రపట్టని జబ్బు ఒకటివుంది. కాబట్టి, నేను నిద్రబోతుంటే, నాప్రక్కనే కూర్చుని—

కాగితం, కలం చేతబట్టి నా కలవరింతల్లోని కవిత్వాన్నంతా Record చేస్తుంటాడు.

మధు : సరే, నేను స్నానంచేసివస్తా ! (అని పోతాడు)

రఘు : [దీర్ఘంగా ఆలోచిస్తున్న రామానుజంతో] ఏమిత్రా, అదేపనిగా ఆలోచిస్తున్నావ్ ?

రామా : ఏముంది ? ఆదివారం ప్రభావం ! అన్నీ అపశకునాలే !

రఘు : మళ్లీ ఏమొచ్చిందిరా ?

రామా : ఏమొస్తేమయితేనేం ? దున్నపోతుమీద వర్షం కురిసినట్లేగా !

రఘు : ఏమిత్రా, అసలు సంగతేమిటో చెప్పకుండా ?

రామా : యిందాక అటు వెళ్లినప్పుడు, హోటల్లో ప్రస్తుతం వున్న వాళ్ల పేర్లు లిస్టు చూశాను. అందులో [విచారంగా] ఆ భ్రాష్టుడిపేరుగూడా వుంది.

రఘు : ఏ భ్రాష్టుడూ ?

రామా : యింకెవడు ? ఆ రామరాజుగాడు !

రఘు : ఎవరూ ? ఆ Dance master ?

రామా : ఆహా ! వాడే.

రఘు : వాడిక్కడున్నాడా ?

రామా : వున్నాడనే చెప్పేది.

రఘు : చచ్చాం ! కొంపమునిగిందే !

రామా : ఆదివారం ప్రభావం !

రఘు: వా డీ మధ్య కోయంబత్తూరులో ఏదో సినిమాలో వేదుస్తున్నా డన్నారుగా.

రామూ : కోయంబత్తూరులో వుంటే—యిక్కడికి వచ్చి పోతుండ కూడదా !

రఘు : అయితే యీ విషయం మధుకి తెలుసా ?

రామూ : వాడి కేం తెలుసు. అసలు యివాళగాకపోతే రేపైనా, ఊర్వశీ. కామరాజులమధ్య వూళ్లోవున్న పుకార్లువింటే వాడు ఆఘాతం గుండె పగిలి చస్తాడు.

రఘు : పుకార్లకేమితే ! లోకులు కాకులు : కా స్తవుంటే గంపంత చేస్తారు.

రామూ : అసలు నిప్పులేకుండా పొగవస్తుందటరే !

రఘు : ఆఁ. యిందులో కామరాజు సుటుకు చేసిందేముందిపాపం ! ఊర్వశికి చిన్నప్పటినుంచి—యింత నాట్యం, సంగీతం నేర్పి యీనాటికి యింత పేరు ప్రఖ్యాతులు సంపాయించి పెట్టాడు. ఏదో కాస్త ఇద్దరూ చనువుగా వున్నారే అనుకో. అంతమాత్రాన రంకులు కట్టేయాలిసిందేనా ?....అయినా యీ పుకార్లు గూడ రెండు సంవత్సరాల క్రిందటిమాట. అయిందేదో అయిపోయింది.

రామూ : యీ ఘోరంచి చూస్తే అయిపోయినట్లేం కనబడ్డంలా.

రఘు : ఏమిట్రా ! నువ్వుకూడా అలాగే అంటావ్ ! ఏదో యివాళ వాడు కూడా కాకతాళీయంగా యిక్కడున్నాడని....

రామూ : కాకతాళీయమైతే సరే, కావాలనే తిష్టవేశాడేమోనని....

నువ్వుగూడా కొంచెం తీవ్రంగా ఆలోచించు ! యిన్నాళ్ళ నుంచి కష్టపడి ఊర్వశిని యింత పైకి తీసుకొచ్చాడుగదా, యిదంతా ఏదురాశా, స్వార్థమూ లేకుండానే చేశాడంటావా?

రఘు : దురాశ వాడికుంటే వుండొచ్చు ! ఊర్వశి కెందుకుండాలి? ఒకవేళ వుంటే, మరొకణ్ణి ప్రేమించి, బహిరంగంగా పెళ్ళిచేసుకోడాని కెందుకు సిగ్గుపడుతుంది ? అయినా అదేమో 20 ఏళ్ళ పడుచుపిల్ల. వాడేమో నలుగురు బిడ్డల తండ్రి - పెళ్లామూ పెద్ద సంసారమూను. దానికిమటుకు కామాత్రం జ్ఞానంలేదూ !

రామా : నేను మటుకు కేటన్నానా ? వాడు ప్రస్తుతం యీ హోటల్లోనే తిష్టవేశాడన్నాను. అబద్ధమా ?—మనం పెళ్ళి తలపెట్టుకున్న యీతరుణంలో వా డిక్కడుండటం ఎంత ప్రమాదం ? అందుకే ఘనం వస్తున్నామని, ముందుగా ఊర్వశికి టెలిగ్రాం యిద్దాంరా అంటే, నువ్వు వింటేగా!

రఘు : ఏమో, నా ఆలోచన అంతదూరం పోలేదు సుమా !

[తలుపు చప్పుడు]

రఘు : ఎవరది ?

[ప్రవేశం : బట్లరు పెరుమాళ్లు]

రఘు : ఏం, ఏం కావాలోయ్ ?

పెరు: మీ కేమి కావాలో అడుగుదామని వచ్చాను సార్!

రఘు: cool drinks వున్నయ్యా?

పెరు: యిరికే సార్!

రఘు: [ఏదో ఆలోచన తట్టి మెల్లగా] అరే, రామానుజం! నువ్వు వెళ్ళి. కాసేపు మధు యిక్కడికి రాకుండా చూడు! నేను వీడితో కాస్త మాట్లాడాలి.

రామా: (లేచి పోతూ) Cool drinks తెచ్చిన వస్నీ నువ్వే తాగెయ్యకు (Exit)

రఘు: నీ పేరేమిటి?

పెరు: నా పేరా, సార్?

రఘు: అవును, నీ పేరే!

పెరు: తిరుగోగర్ణం బాల సుబ్రమణ్య వెలాయిద పెరుమాళ్.

రఘు: ఏ పెరుమాళ్లు?

పెరు: తిరుగోగర్ణం బాలసుబ్రమణ్య వేలాయిద పెరుమాళ్ సార్.

రఘు: పుట్టుక?

పెరు: ఆమ,సార్.

రఘు: నే నడిగింది—'నువ్వు పుట్టింది ఎక్కడ' అని.

పెరు: 'ఎక్కడ' ఏమి సార్!

రఘు: అంటే ఏ వూళ్లో అని!

పెరు: అదా సార్! కుంబకోణం, సార్.

రఘు: కుంబకోణమా? చాలామంచి town అనుకుంటానే!

పెరు: ఏమి మంచి సార్! అదే మంచి!

రఘు: నీకు పెళ్లయిందా?

పెరు: ఆ, అయింది సార్.

రఘు: భార్య వుందా?

పెరు: (జంకుతూ) ఆ, ఉన్నట్టే సార్.

రఘు: 'వున్నట్టే' ఏమిటి?

పెరు: రెండు యేళ్ల కిందట ఒక సిపాయివాడితో లేచి పూడి చింది సార్!

రఘు: ఆఁ, పెరుమాళ్లు! యీ ప్రక్కగది ఊర్వశి అనే అమ్మా యిది గదూ?

పెరు! ఆమా సార్!

రఘు: ఆమె గదిలో లేదే! ఎక్కడికి వెళ్లింది?

పెరు: సాయంత్రం 6 గంటలకు వాళ్లంతా Picnic పోయి వుండారు సార్!

రఘు: వాళ్ళు! వాళ్ళంటే?

పెరు: యీ హోటల్లో వున్నవాళ్లు శానామంది పోయినారు సార్ మా ప్రొప్రయిటరుగూడా పోయివుండారు. ఎన్నూరు తెలీదు సార్? Boat club అదీ వుండాది- అక్కడికి పోయివుండారు సార్.

రఘు: యిక్కడికి కెంత దూరం?

పెరు: ఎంత, కారులో గంట, గంటన్నర ప్రయాణం.

రఘు: తిరిగి ఎప్పుడు వస్తారో?

పెరు: ఏమోసార్ కారులో Biscuits, cakes, పండ్లు, ఫలహా రాలు అన్నీ మస్తుగా వేసుకు పోయుండారు.

రఘు: నేనడిగింది, వాళ్లు తిరిగి ఎప్పుడు వస్తారని?

పెరు : అదిదానే నేను సెప్పేది ! రేపు ఉదయం లోపలవచ్చేది లేదు సార్.

రఘు : సరే ! ఎవరెవరు వెళ్లారు ?

పెరు : చాలా పెరియ పార్టీ సార్ అది—అందులో ముఖ్యం మా ప్రొప్రయిటరు Cousin ఒకాయన వుండారుసార్. ఆయనది కోయంబత్తూర్: పెద్ద జమీందారు. ఆయనకి Dances, picnics అంటే మహాపిచ్చి సార్. మరీ ఆయమ్మ ఆట. పాట అంటే ఆయనకి ఎంతో ఆనందం !

రఘు : ఆఁ, పెరుమాళ్లూ ! చూడు—నీకు కామరాజుగారుతెలుసా ?

పెరు : కామరాజు తెలీకేమి సార్ ! ఆయన 3 రోజుల్నుంచీ మన హోటల్లోనానే వుంటారు.

రఘు : యీ హోటల్లో !

పెరు ఆమ సార్ : Room No 24 దానే,

రఘు నిన్న Picnic partyలో ఆయనగూడా వున్నారా?

పెరు ఆమ సార్. ఆయమ్మతోపాటీ ఆయనదా వుంటురు.

రఘు ఎవరితో ? ఊర్వశి తోనా ?

పెరు ఆమ. యిద్దరూ ఒక కారులోనేగదా పోయివుండారు. వాళ్ళిద్దరూ బలే జంట సార్! ఒకళ్లొకళ్లని వాదిలేదేలేను. ఆమ్మ ఆడతావుంటే, అయ్యా పాడతావుంటాడు. ఆ యెన్నెట్లో, ఆపదవలమీద ఏమిఆనందం సార్ వాళ్లది!

రఘు : ఆవిషయం నీ కెలా తెలుసు ?

పెరు : నన్నుగూడ తీస్కుపోనారు ఒకతూరి.

రఘు : సరే !....ఇకవెళ్లు....

పెరు : [జంకుతూ] మీరేమీ కోపం సేస్కోకుంటే ఒక్కమాట అడుగుతాను సార్.

రఘు : ఏమిటి ?

పెరు : ఇందాక.... మొదట్లో....మీరు....

రఘు : —నీ భార్య, సంసారం విషయం అడిగా నెందుకనా?

పెరు : అవును సార్.

రఘు : అందులో ఒక రహస్యం వుంది. అది మనస్తత్వ శాస్త్రానికి సంబంధించిన విషయం. ఒక మనిషిదగ్గరనుంచి నిజాన్ని రాబట్టాలంటే—ముందు వాడికి సన్నిహితమైన విషయాలు అడగాలి. అప్పుడు వాడు బాధ్యతతో జాగ్రత్తగా జవాబు చెపుతాడు. వెంటనే, వాడికి ఆలోచించుకోవడానికి అవకాశం యివ్వకుండా, మనక్కావలసిన విషయం అడగాలి. ఠకీమని నిజం చెప్పేస్తాడు....యీ సూత్రం—రఘుపతి & రామానుజం అనే యిద్దరు మహాకవులువ్రాసిన ఒక డెటెక్టివు నాటకంలో వుంది. యీ సారి వచ్చినపుడు, ఆపుస్తకం యిస్తాను: జాగ్రత్తగా చదువుకో.

పెరు : రొంబ Thanks sir !

రఘు : ఇక వెళ్లు !

పెరు : [పోబోయి, మళ్లీ ఆగి] ఏమి cool drinks కావాలో చెప్పలేదు సార్.

రఘు : ఏమున్నయ్ ?

పెరు : అన్నీ వున్నాయ్ సార్ ! ద్రాక్ష, Orange, lemon, Ginger, బాదంఘీర్....

[పక్క గదితలుపు తీసిన చప్పుడు]

అదుగోసార్ ! ఆయమ్మ వచ్చినట్టుందాది సార్!

[ఊర్వశి కూనిరాగంతో కులాసాగా పాడుతూంటుంది]

[యిద్దరూ జాగ్రత్తగా వింటారు]

పెరు: ఆమ సార్! ఆయమ్మదానే!

రఘు: [సంతోషంతో] ఆఁ- అవు నవును. ఊర్వశే. బలే-అయితే Drinks అక్కరలేదు గాని—చల్లని కాఫీ- Ice coffee నాలుగు పెట్టుకురా! చాలు....

పెరు: Thank you, Sir......

రఘు: [హడావుడిగా రెండోవైపు చూచి] అరే, ఏం జేస్తున్నార్రా? మీ స్నానాలు మండిపోను, యింకెంత సేపురా! ఊర్వశి వచ్చింది, త్వరగా కానివ్వండిరా!

మధు: అయి పోయింది బాబాయ్! Dress చేసుకుంటున్నా.

మధు
రామా } [లోపల్నుంచి, ఏదో హడావుడిగా మాట్లాడుతారు]

రఘు: యింకెంత సేపురా Dressing ? కానివ్వండిరా త్వరగా!

[అని తనుగూడా హడావుడిగా వాళ్ళదగ్గరకే పోతాడు.Exit]

[యింత సేపూ ఊర్వశి మెల్లగా పాడుకుంటూనే

వుంటుంది. కామరాజు ప్రవేశం. వెంటనే ఊర్వశి పాట ఆపుతుంది]

కామ: ఏమిటీ సంగీతం ఊర్వశీ! నన్నేడిపించడమే నీ కానందంగా వుందా?

ఊర్వ: ఏమి టీ మర్యాద? యీ వేళప్పుడు తిన్నగా నాగదిలోకి రావడమే!

కామ: నువ్వుండగానే వచ్చాగా! యిందులో దొంగతనమేముంది!

ఊర్వ: యిదిగో మాస్టారూ! మళ్ళీ చెబుతున్నా వినండి! అయిందేదో అయిపోయింది. ఎల్లకాలం అలాగే జరగాలంటే వీల్లేదు. నేనూ పెళ్ళి చేసుకుని, గుట్టుగా కాపురం చెయ్యాలని నిర్ణయించుకున్నాను. యిక మీరు నన్నిలా వెంటాడడం మర్యాద గాదు!

కామ: మర్యాద కాదూ! [గద్గదంతో] నీకు నాట్యం నేర్పి, పేరు ప్రఖ్యాతులు సంపాదించిపెట్టిన నేను, నీతో చల్లని వెన్నెల్లో ఎన్నో స్వర్గతుల్యమైన శరద్రాతులు చవి చూచిన నేను.... [అంటూ దగ్గరకు వస్తాడు]

ఊర్వ: [లేచి] ఏమి టా గడుసుతనం! చెప్పేది ఆమాత్రిం అర్థం చేసుకోలేరు. రేపో మాపో మధు రాబోతున్నాడని తెలిసికూడా యింకా ఏమిటీ మీ మొండితనం?

కామ: [ఉద్రేకంతో] రానియ్, వాడి పీక నులిమేస్తాను.

ఊర్వ: అబ్బ, ఏమి టా వుద్రేకం?.........యిలా రండి........

[కామరాజు కంటనీరు పెట్టుకుంటాడు]

ఊర్వ: [బుజ్జగిస్తూ] మొగవారు-పైగా యింత వయసొచ్చింది. అదేమిటండీ! ఆడవాళ్ళలాగ కంట నీరుపెట్టుకుంటారు ?

కామ: నీమీద నాకున్న ప్రేమ అలాంటిది-ఊర్వశీ! యీ దీనుణ్ణి కరుణించవూ? [అని ప్రాధేయపడతాడు]

ఊర్వ: [తల నిమురుతూ] అబ్బ! పసిబిడ్డకన్నా అన్యాయం! లెండి, యిలా కూర్చోండి.

[కామరాజు మరీ దగ్గరగా కూర్చోబోతాడు]

ఊర్వ: [వారిస్తూ] అహ్హా!....[బ్రతిమాలుతూ గడ్డం పుచ్చుకుని] యిక వెళ్ళండి, ప్రొద్దుపోయింది. చాలా బడలికగా కూడా వుంది ; నిద్రపోవాలి.

కామ: అలాగే, నిన్ను నిద్రపుచ్చే వెళతాను. [అంటూ అటూయిటూ చూచి] కాస్త కాఫీ ఏమైనా వుందా?

ఊర్వ : అదిగో బల్లమీద Flaskలో వుంది .... కాఫీ తాగుతుం డండి. యిప్పుడే ముఖం కడుగుకుని వస్తాను. [అని లేచి వెళుతుంది]

[కామరాజు Flaskలో కాఫీ Cupలోపోసుకుని త్రాగుతూంటాడు]

[రెండో గదిలో రఘుపతి, రామానుజం, మధు మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వస్తారు]

రఘు : [జాగ్రత్తగా విని] [చప్పుడు వినబడక] యిశ్ ! [అని వారిస్తూ] అరే ! నిద్రపోయినట్లుందిరా !

మధు : యిప్పుడేగదు బాబాయ్, వచ్చింది. అప్పుడే నిద్రపోయుంటుందా ?

రఘు : మరి చప్పుడేం వినబట్టంలేదే ! గోడదగ్గరకు రండి.

[అని ముగ్గురు గోడదగ్గరకువచ్చి చెవులు గోడకానించి వింటారు]

కామ : [లోపల్నుంచి] నీవే నా హృదయాధిదేవతవు. నా ప్రణయ సామ్రాజ్యానికి పట్టమహిషివి.

ఊర్వ : [విసుగ్గా] అబ్బ ! మళ్లీ మొదలా ?

కామ : అవును ప్రేయసీ ! మకరంద మాధుర్యాన్ని మధుపం మరచిపోగలదా ? నిన్ను నా జన్మలో మరువలేను. నీవులేందే నే నొక్కక్షణం కూడా బ్రతకలేను.

[ముగ్గురూ ఒకరిమొఖాలు ఒకరు చూచుకుని నిర్ఘాంతపోతారు]

ఊర్వ : [నిష్ఠూరంగా] ఊఁ, అంతా బూటకం.

కామ : బూటకం కాదు ప్రేయసీ ! యిది నా హృదయం పలికే పరమసత్యం. నీ కోసం నేను ప్రణయోన్మత్తుణ్ణయి పోతున్నాను. కాని నీవో ! నన్ను రసం పిండిపారేసిన పిప్పిలాగా గెంటేస్తున్నావు.

ఊర్వ : ఆఁ ఆఁ, ఎంతమాట ! యిలా రండి ! ఏదీ ! చంద్రబింబం లాంటి మీ ముఖారవిందం.

మధు : [బిక్కమొహంతో] బాబాయ్ !

కామ : ప్రేయసీ !

ఊర్వ : యిశ్శ్ ! [అని వారిస్తుంది]

కామ : నన్ను ఎలాగో మభ్యపెట్టి మరపించాలని చూస్తున్నావా ? అన్యాయం ! రసం పిండి పారేసిన పిప్పికన్నా హీనంగా చూస్తున్నావ్ నన్ను !

ఊర్వ : అబ్బ ! రెండి ! ఎందుకండి అంత దీనంగా ప్రాధేయ పడతారు? మీకు తెలీదు, మీరంటె నాకెంత యిష్టమో ?

[రఘు, రామానుజం చేతులతో తలలు పట్టుకుని నిర్ఘాంతపోతారు. మధు గుడ్లుతేలవేసి, కూలబడతాడు]

కామ : ఆ శరత్కాలపు చల్లని వెన్నెల్లో, ఆ పారిజాతాల తియ్యని పరిమళంలో—ఎన్నెన్ని సుందరస్వప్నాలు ! —ఎన్నెన్ని మరపురాని అనుభవాలు !! అన్నీ మరచిపోయావా ప్రేయసీ ?

మధు : ఆ గొంతు కామరాజుదే !

రామా : ఏమో అనుమానంగా వుంది.

ఊర్వ : ఆఁ, వుండండి ! ఏమి టా వుద్రేకం !

కామ : ఆ చక్కని ఆకారం చూస్తే ఎవరికి కలుగదు వుద్రేకం ? ఆ మేలిమి బంగారు ఛాయ వన్నె !....

ఊర్వ : ఆఁ— దూరంగా !

కామ : అబ్బ ! గుండ్రంగా, నున్నగా, మెత్తగా ! ఓ! ఏం పరి మళం !

రఘు: మధూ! నువ్వు ఆ గదిలోకి వెళ్లడం మంచిది. [అని చేయిపట్టుకుని తీసుకుపోబోతాడు]

మధు: [దుఃఖం ఆపుకుంటూ] యిదేదో మహాపతివ్రత

అనుకున్నాను.... [ఉద్రేకముతో] ఆ కామరాజుగాణ్ణి చంపేస్తాను. [అని విపిలించుకుంటాడు]

రఘు. ఉండరా! తొందరపడకు. కాస్త నిద్రపో వెళ్ళి.

మధు: నిద్ర!

రామా: అందుకే ముందుగా telegram యిద్దాంరా అంటే నువ్వు విన్నావ్? [అని నుదురు మీద కొట్టుకుంటాడు రామానుజం మధు పక్కగదిలోకి పోతారు.]

కామ: ఏదీ! అలసి సొలసిన నా నేత్రాలపై మరపురాని.....

ఊర్వ: అమ్మో! నిద్రలేక మీ కళ్ళు చూడండి ఎంత యెర్రబడినయ్యో! వెళ్ళి పడుకోండి.

కామ: అయితే యిక మనం దూరమైపోవలసిందేనా?

ఊర్వ: మీరేమీ అనుకోవద్దు. మీరు నాకు చేసిన మేలు నా జీవితంలో మరచిపోను.

కామ: నాకు దిక్కేమిటి?

ఊర్వ: అలా అనకండి. దయచేసి వెంటనే వెళ్ళి పోండి. మీ రిక్కడుండటం ఎంతో ప్రమాదం. రేపో మాపో మధు వస్తాడు. అతనికి మన విషయం తెలిస్తే యింకేమన్నా వుందా? మీరు యీవూరు నుంచి పొద్దున్నే మొదటి రైలుకే వెళ్ళి పోండి; మీకు పుణ్యముంటుంది.

కామ: పోవలసిందేనా?

రాఘు: మనిషన్న తరువాత తృప్తి అనే దుండాలి!

కామ: వస్తాను. మరి శెలవు!

రఘు: (యీ గదిలో) దయ్యె చెయ్యండి (అని దణ్ణం పెడతాడు. కుర్చీలో కూర్చుని అదేపనిగా ఆలోచిస్తూంటాడు) [కాసే పటికి]

రామా: (ప్రవేశం) ఏమిత్రా కర్తవ్యం? (నిట్టూర్పుతో కూర్చుం టాడు)

రఘు. యిశ్శ్! నిశబ్దం! యిప్పుడే కథానాయకుడు నిష్క్ర మించాడు. కథానాయిక హంసతూలికాతల్పం మీద శయనించిది.

రామా: మనమేమో యీ నరకకూపంలో గిజగిజ కొట్టు కుంటున్నాం.

రఘు: సరిలే. మధూ ఎలా వున్నాడు?

రామా: ఎలావున్నాడు- ఏడ్చి ఏడ్చి యిప్పుడే సొమ్మసిలి పడు కున్నాడు....(గోడ దగ్గర) మధుపం! మకరంద మాధు ర్యం! ఓరి పీడి తస్సా గొయ్యా!

రఘు: (మధు గదివేపు తిరిగి) నే నిక వాడి మొఖం ఎలా చూసేది?

రామా: కావాలని Special గా Reserve చేయించావు గదూ యీ గదుల! ఏం అదృష్టం!....అటు ప్రేయసి, యిటు ప్రియుడు! మధ్య గోడ! వియోగం! విరహం! కవియైన వాడికి యింతకన్నా మంచి కథావస్తు వేంగావాలి?

రఘు: చాల్లే ఆపవోయ్, నీ యెత్తిపొడుపులు!

రామా: ఏం? యీ రసాభాసాని కంతకూ బాధ్యత నీది కమా? యీ హోటల్లో యిన్ని గదులుంటే యీ గదులే దొరి

కాయే నీకు Reserve చేయించడాన్కి? కాస్త వెనకా ముందు ఆలోచించక్కరలా!

రాఘు: నేను మటుకు యిలా అవుతుం దనుకున్నారా? వాళ్ల మంచికే చేశాను. చివరికి కథ యిలా అడ్డం తిరిగింది.

రామా: యిప్పుడు చూడు-మన మనుకున్నదంతా నాశనం-సర్వ నాశనం!

రఘు: మధు ఏమంటున్నాడు?

రామా: ఏమంటాడు? ఆ ప్రణయగీతాలన్నీ చించి తగలబెట్టి-ఆ ఊర్వశిని గొంతుపిసికి చంపుతానంటున్నాడు. నువ్వింవా కన్నట్టు- ఇదే నాటకం అయితే- యిది విషాదాంతం కావలసిందేగాని వేరే మార్గంలేదు.

రఘు: [తీవ్రంగా ఆలోచించి, ఏదో ఆలోచన తట్టినట్టు] కాదు! విషాదాంతం కాకూడదు: సుఖాంతమే చేస్తాను. చేసితీర్తాను.

రామా: యిక నువ్వు చేసేదేమిటి, యింత జరిగిం తరువాత!

రఘు: ఎంత జరిగినాసరే, ఏం ఫర్వాలేదు. నువ్వేం కంగారు పడవద్దు. యీ నాటకాన్ని సుఖాంతం చేసే బాధ్యత నాది.

రామా: యీ పాత్రలతోనే?

రఘు: ఆc- యీ పాత్రలతోనే! నాటకమంతా నే నడుపుతాను, నువ్వు చూస్తూవుండు.

రామా: ఎటువంటి నాటకాన్నయినా సుఖాంతం చేయడంలో రఘు పతికి మించినచేయిలేదని నాకుమటుకు తెలీదూ? అయినా, ఆ చేసేదేమిటో కాస్త నాచెవినికూడా వెయ్యగూడదూ?

రఘు : ఆఖారం అంతా నామీద వదిలెయ్!

రామా : సరే అలాగే కానియ్! యీ గండం గడచి గట్టెక్క డమే నాక్కావలసింది. ఇక నే వెళ్ళి పడుకుంటా.

[అని వెడతాడు]

[గడియారం నాలుగు గంటలు కొడుతుంది. రఘు అటూ యిటూ కాసేపు తిరుగుతాడు. మధ్య మధ్య డాక్టర్ గదివేపు చూస్తూ ఏదో ఆలోచించి. తలపంకిస్తుంటాడు. కాగితం. పెన్సిలు తీసు కొని. ఏవో నాలుగు ముక్కలు రాస్తుంటాడు]

రామా : [ప్రవేశం]

రఘు : మళ్లీ వచ్చావేం? మధు ఎలావున్నాడు?

రామా : నా కేమో భయంగా వుందిరా? వాడు మంచం మీద పడుకుని కన్నార్పకుండా అదేపనిగా ఇంటి దూలాలవంక చూస్తున్నాడు. కదలడు మెదలడు. అడిగిందానికి జవాబు చెప్పడు.

రఘు : కాస్త స్థిమితపడిందాకా అలాగే వుంటాడులే.

రామా : మరి యింతకూ దీని కేదో ఉపాయం ఆలోచించానన్నావ్ ఏమిటది?

రఘు : ఆలోచించాను. కాని నీకు చెప్పను. ఈ ఒక్క విషయంలో మాత్రం నీ జంటకవిత్వంతో బాధపెట్టక-నన్నొక్కణ్ణి ఒదిలెయ్.... (రామానుజం పోబోతాడు) ఆఁ నాకు కొంచెం Information కావాలి చెప్పు.

రామా : అయితే నా అవసరం అంతవరకేనన్నమాట.

రఘు : కాదులే చెప్పవోయ్! కామరాజు భార్య, పిల్లలు యిప్పు డెక్కడున్నారు ?

రామా : బెజవాడలో.

రఘు : అడ్రసు ?

రామా : నాగేశ్వరరావురోడ్డు, గాంధీనగరం, బెజవాడ.

రఘు : [వ్రాసుకుని] ఊ—ఊర్వశి తల్లిపేరేమిటి ?

రామా : సుందరమ్మో ? సుందరాంగో ?

రఘు : అడ్రసు ?

రామా : కొత్తపేట, గుంటూరు.

రఘు : ఇప్పు డక్కడే వుంటుందా ?

రామా : ఏమో నాకేం తెలుసు .... అయినా యీ గొడవంతా ఎందుకురా? వెంటనే దాన్ని పిలిపించి, అడగాల్సిన నాలుగు మాటలు అడిగి తేల్చెయ్యక!

రఘు: ఏ మడుగుతావ్?

రామా: ఏమడుగుతానా? పిలువు దాన్ని-ఏమడుగుతానో చూద్దువుగాని!

రఘు: తొందరపడకురా! నా కామాత్రం ఆలోచన లేదను కున్నావురా? అడిగితే ఏమంటుంది? -'అమ్మో! నాయనో! నా కేం తెలీ' దని గోలపెడుతుంది. యింకా ప్రాణం మీద కొస్తే "నేను వాణ్ణి వెళ్ళి పొమ్మంటున్న సంగతి మీరే విన్నారుగా?" అని సంగనాచిలాగా నటిస్తుంది. అప్పు డేంజేస్తావ్?

రామా: చేసే దేమిటింకా! అటో యిటో తేల్చుకోక!

రఘు. మన మయితే ఎలాగయినా చెయ్యొచ్చు. మరి వాడి సంగతి ఆలోచించు. ఈ పెళ్ళి యీ పరిస్థితిలో Fail అయిందంటే వా డింకేమయినా చేతికి దక్కుతాడా?

రామా : ఏమో నన్నా! నాకేం దారి కనబడ్డంలా!

రఘు : మనం కొంచెం తీవ్రంగా ఆలోచించావేగాని, దారిలేక పోయిందీ?-వెళ్ళి, వాడు నిద్రపోయిందాక- ప్రక్కని కూచ్చుని కొంచెం ఓదార్చు!

రామా : వాడీపూట నిద్రపోతేం! అయినా నే నేమని ఓదార్చేది!

రఘు : ఆభారం అంతా నా మీద వదిలెయ్! నీ సహాయం గనక లేకపోతే- నేను ఎంతలావు కార్యమైనా యిట్టే సాధించ గలను. నువ్వింక వెళ్ళు; వాడి దగ్గరుండు.

[రామానుజం లేచి వెళతాడు]

[రఘు కూర్చుని ఏమేమో వ్రాసుకుంటూంటాడు]

[తలుపు చప్పుడు]

పెరు : సార్ !

రఘు : Come in !

పెరు : [ప్రవేశం- Trayలో నాలుగు కప్పులు కాఫీతో] Ice coffee sir !

రఘు : నీకు చెప్పి ఎంతసేపయింది? నీకు చెప్పినతరువాత ఒక పెద్ద తుఫాను, ఒక భూకంపం, ఒక ప్రపంచయుద్ధం - యిన్ని జరిగాయి. నీ కిప్పటికి తీరింది....

పెరు : కొంచెం Delay అయింది సార్ !
రఘు : అక్కడ పెట్టి వెళ్లు. నాలుగు కప్పులు చాలునా సార్ ?
రఘు : మూడు చాల్లే. ఒకటి పట్టుకెళ్లు.
పెరు : Sir, Breakfastకు ఏమైనా Special order చేస్తురా ?
రఘు : ఆఁ– ఆఁ–!
పెరు : Vegitarian ? Non- Vegitarian sir ?
రఘు : Vegitarian! pure vegitarian! నాలుగు యిడ్లీ సాంబార్, రెండు పూరీ potato! Eggs with toaste
పెరు : Vegitarian అంటిరిగదా సార్ !
రఘు : Egg vegitable కిందేలెక్క....ఆఁ Fruits! coffee ....చాలు.
పెరు : సరిదా సార్ ! యిప్పు దేమయినా కావాలా సార్ ?
రఘు : ఏమీ అక్కరలేదు. [పెరు. పోబోరాడు]
రఘు: యిదుగో చూడు! కాసిని తెల్లకాగితాలు– నాలుగు Telegram forms–కావాలి.
పెరు: అన్నీ లైబ్రరీ Room లో యిరికె సార్; యిక్కడికి తెచ్చి పెట్టమంటారా?
రఘు: అయితే అక్కరలేదు. అక్కడే వ్రాసుకుంటాను; ప్రశాంతంగా వుంటుంది.
పెరు: సరిదా సార్ నేను పోయి Library Room లో light అదీ వేసి–అన్నీ arrange చేస్తాను సార్.

రఘు: All right!

పెరు: [పోబోయి, మళ్లీ ఆగి] Sir! Break fast ఎన్ని గంట లకు కావాలి సార్?

రఘు: యిప్పు డెంతయింది?

పెరు: నాలుగు దాటింది సార్.

రఘు: అయితే Break fast 7 గంటలకు-అహాఁ: 6 గంటలకే తీసుకురా!

పెరు: సరిదాసార్. సరిగా 6గంటలకు తెస్తునుసార్ [అనిపోతాడు]

(Curtain)



# నా ట కం

## (రెండవ రంగం)

[తెరలేవగానే గడియారం 6 గంటలు కొడుతుంది. రఘుపతి కుర్చీలో కూర్చుని, ఏదో వ్రాసిన కాగితాలు తిరగేస్తుంటాడు ప్రవేశం పెరుమాళ్లు. పెద్ద Tray తో ఫలహారాలు తెచ్చి tea post మీద పెడతాడు]

పెరు: Good morning Sir [పేపరు యివ్వబోతాడు]

రఘు: Good morning . ఏమిటది?

పెరు: యివాళ Morning Paper, Sir!

రఘు: నువ్వు చదివావనుకుంటాను!

పెరు: చదివాను సార్.

రఘు: అందులో నా విషయం ఏమైనా వుందా?

పెరు: లేదు సార్!

రఘు: అయితే అక్కరలేదు, తీసుకెళ్ళు.

పెరు: సరిదా సార్.-చూడు సార్! మీరు Order యిచ్చినవన్నీ తెచ్చాను సార్. యిడ్లీ, పూరీ, Fried Eggs, Toast, Coffee....అంతేగదు సార్?

రఘు: కాఫీ Strong గా తెచ్చావా?

పెరు: అవును సార్. Special గా చేసి తెచ్చాను.

రఘు: నాకు Strong coffee అంటే యిష్టం.

పెరు: ఆమా సార్. శానామందికి అంతే సార్. మా మేనత్త ఒకామె వుండేవి సార్-ఆమెక్కూడా ...

రఘు: ప్రస్తుతం మీ మేనత్త విషయం కాస్త ఆపితే ఏమైనా ప్రమాదమా?

పెరు: ఏమీలేదు సార్!

రఘు: అయితే ఆపు; తరువాత మాట్లాడుదాం.

పెరు: మీయిష్టం సార్. దానికేమి?

రఘు: రాత్రంతా నిద్రలేదు. పైగా పెద్దవాణ్ణి, కవిని, కళాకారుణ్ణి! నా కష్టసుఖాలు గూడా కొంచెం ఆలోచించు [లేచిఅవులించి వళ్లు విరుచుకుంటాడు]

పెరు: ఆమ సార్. నిజం. అర్థమయింది సార్.

రఘు: [ఫలహారాలు పరీక్షిస్తూ] అరే-ఒకటిగూడ మరచి పోకుండా తెచ్చావే!

పెరు: అట్లా మరచిపోతానా సార్! మనకి Twenty five years service సార్ యీ హోటల్లో!

రఘు: ఆఁ- చెప్పడం మరచి పోయాను. ఒక Cigarette tin గూడ పట్టుకురా!

పెరు: సార్ నే నొకమాట సెప్తాను. కోపం సేస్కోవద్దు సార్

రఘు: ఏమిటది!

పెరు: మీరు Health జాగ్రత్తగా సూస్కోవాలి సార్. రొంబ జాస్తి Smoke సేస్తురు సార్. ఆ Library Hall లో చూచాను, యాభై సిగరెట్టు ముక్కలైనా వుండాయ్‌సార్.

రఘు: తప్పు, యా భైకాదు, ముప్పైతొమ్మిది!
పెరు: రొంబ జాస్తి సార్!
రఘు: ఆ(- పెరుమాళ్లూ! నీకు జీతమెంత?
పెరు: అరవై రూపాయలు సార్.
రఘు: సరిపోతుందా?
పెరు: [విచారంగా] ఒక్కణ్ణెగదు సార్. ఏదో సరిపోతుంది.
రఘు: నీలాంటివాళ్లు లోకానికి చాలా అవుసరమోయ్.
పెరు: సార్. మీ రింతశ్రద్ధగా నా కష్టసుఖాలు అడుగుతూంటే- రొంబ ఆనందంగావుంది సార్! మీ సేవని కావాలన్నా, చెప్పండి సార్, చేస్తును.
రఘు: ప్రస్తుతానికి నీ వొక పెద్దసహాయం చెయ్యాలి! ఏమిటంటే- లక్షణం నువ్వు యిక్కడనుంచి వెళ్లిపోవాలి. ఎవరన్నా నాకోసం వచ్చి అడిగితే 'నిద్రపోతున్నారు, లేపవద్దన్నారు' అని చెప్పు. తెలిసిందా?
పెరు: నిద్రపోతున్నారు అని చెప్పవలెనా సార్?
రఘు: "లేపవద్దన్నారు" అనిగూడ చెప్పు.
పెరు: సరిసార్. [Exit]
రఘు: [Phone దగ్గరకు వెళ్లి] Hello—ఊర్వశి గది కావాలండీ! —ఆ(- ఊర్వశి!

[Pause] [ప్రక్కగదిలో Phoneగంటమోగుతుంది]

ఊర్వ: [నిద్రమత్తులో Phone తీసి] Yes ???
రఘు: Hello!

ఊర్వ : Hello !!!

రఘు : [నాజూగ్గా] Hello !

ఊర్వ : ఎవరది ?

రఘు : యింత ప్రొద్దున్నే తమకు నిద్రాభంగం కలిగించిన పరమదుర్మార్గుడిపేరు Police information ప్రకారం రఘుపతి !

ఊర్వ : రఘుపతి! మామగారు!

రఘు : ఆఁ- అవునవును, కోడలుగారు! కులాసాగా వున్నారా ?

ఊర్వ : మీ రెక్కడనుంచి మాట్లాడుతున్నారు ?

రఘు : ప్రక్కగదిలోనుంచి.

ఊర్వ : ఏమిటి !

రఘు : ఆశ్చర్యంగా వుందిగదూ! నీ ప్రక్కగదిలోనే వున్నాను.

ఊర్వ : నిజంగానా ?

రఘు : ప్రస్తుతానికి ఆ పరామర్శలు కాస్త ఆపి, నువ్వొక సారి యిక్కడికి అర్జంటుగా రావాలి.

ఊర్వ : అమ్మో ! నాకేవో భయంగావుంది. ఎందుకు ?

రఘు : [రిసీవరు కిందపెట్టి] ఏం భయంలేదు. ఆ తలుపుతీసి బట్టలు వేసుకుని— అహఁ- బట్టలువేసుకుని ఆ తలుపు తీసి—యిటు తిరిగి యీగదిలోకి రావాలి.

ఊర్వ : ఏమిటీ ? సరిగా వినబడ్డంలా ! యీ ఫోను కేదో రోగ మొచ్చినట్టుంది.

రఘు : [గట్టిగా, గోడకేసి] తమరొకసారి యిక్కడికి అర్జంటుగా దయచేయాలి, వినబడిందా ?

ఊర్వ : ఆఁ- ఆఁ- యీసారి బాగా వినబడింది. [హడావుడిగా] వొస్తున్నా ! వొస్తున్నా ! [అని లేచి]

[బట్లరు సిగరెట్ టిన్ యిచ్చి వెళ్తాడు]

ఊర్వ : [ప్రవేశం రఘుపతి గదిలోకి] నను స్తే ! ఏమిటండీ ?

రఘు : కూర్చో, చెబుతాను. యిప్పుడు మనం కొన్నివిషయాలు చకచకా తేల్చేసుకోవాలి.

ఊర్వ : అసలేం జరిగిందండి. అబ్బా-చెప్పండి!

రఘు : కూర్చో !

ఊర్వ : ఎందుకు !

రఘు : యిప్పుడు కూర్చోకపోతే- నేను చెప్పేవిషయం విన్నాక ఒక్కసారి కూలబడతావు. నడుములు విరుగుతాయ్; కాబట్టి ముందే కూర్చుంటే అంత ప్రమాదం వుండదు.

[అని కూర్చోబెడతాడు]

ఊర్వ : నా కర్థం కావడంలేదు.

రఘు : అర్థమవుతుందిగా !.... అమ్మాయ్ ఊర్వశీ ! నువ్వు మా వాణ్ణి-మధుని-ప్రేమించి, పెళ్లిగూడ నిశ్చయించుకున్నావు గదా ! యింకా సీ కా కామరాజుతో ఆ తతంగం ఏమిటి చెప్పు.

ఊర్వ : అమ్మో ! నాయనో ! అంతా అబద్ధం, పచ్చిఅబద్ధం !

రఘు : అంతేగదా! "నీ కెందుకు పోవయ్యా" అంటా వనుకున్నాను.

ఊర్వ : మిమ్మల్ని అంతమా టంటానండి? నాకు తెలీదూ: మీరు నా మేలు కోరేవారనీ- ముఖ్యంగా మధుకి తల్లి, దండ్రి, గురువూ, దైవం అన్నీ మీరేనని- నాకు తెలీదూ? నిజం చెబుతున్నాను నమ్మండి. అవంతా అబద్ధం!

రఘు : అలాఅను—దానికి తగిన సమాధానం చెబుతాను. నేను రాత్రంతా యీ గదిలోనే వున్నాను. [ఊర్వశి గోడవంక చూస్తుంది] మన కర్మంకాలి యీ గదిగోడలు కాగితం మందాన కట్టారు.

ఊర్వ : [రహస్యం బయటపడిందని తెలుసుకుని భయంతో] అమ్మో!

రఘు : రసం పిండిపారేసిన పిప్పి! [ఊర్వశి తలవంచుకుంటుంది] మధుపం! మకరంద మాధుర్యం!—యిదుగో ఊర్వశీ—అనవసరపు ఆలస్యమెందుకు? నిర్మొఖమాటంగా మాట్లాడుకుని విషయం ఎంత త్వరగా తేల్చుకుంటే అంత మంచిది.

ఊర్వ : అయితే—మీరు వింటే—నే నన్నమాటలు గూడ విన్నారుగా?

రఘు : ఆఁ! ప్రతి అక్షరం విన్నాను.

ఊర్వ : అయితే మీకు తెలీదూ- ఆయన్ని వెళ్లిపొమ్మని నే నెంత ప్రాధేయపడ్డానో? వెళ్ళిపోతానని మాటగూడ యిచ్చాడు! యివాళ మధ్యాహ్నం తప్పక వెళ్ళిపోతాడు. మీరు మటుకు

దయచేసి యీ విషయం ఏవరితోనూ అనకండి. ముఖ్యంగా మధుతో........

రఘు : ఆహాఁ- ఆగు అంతట ! అంతతేలికలో తేలేదయితే-నే నీవిషయం అసలు నీముందు కదిలించేవాణ్ణా ? అంత తేలిగ్గా లేదు ఊర్వశీ ! పరిస్థితులు చాలా విషమించాయి.

ఊర్వ : [కుర్చీలో వెనక్కివాలి] అయితే మీ రనేది....

రఘు : యింకా అర్థంకాలా ?

ఊర్వ : ఏమిటి ? మధుకూడా....

రఘు : ఆ. మధుకూడా స్వయంగా విన్నాడు.

ఊర్వ : అయితే -మధు యిక్కడున్నాడా ?

రఘు : యిక్కడే వున్నాడు.

ఊర్వ: ఏడీ ? [అటుయిటూ చూస్తుంది]

రఘు : ప్రస్తుతం ఆ ప్రక్కగదిలో నిద్రపోతున్నాడు. రాత్రి మటుకు యీ గదిలో మేలుకొనేవున్నాడు.

ఊర్వ : [నిట్టూర్పు. నిస్పృహతో] అయితే యిక నాకు విషంతప్ప వేరే శరణ్యంలేదు.

రఘు : అదేం లాభంలేదు.

ఊర్వ : సీసానిండా వుందండీ.

రఘు : విషం సంగతి కాదు నే చెప్పేది. ఆత్మహత్యవల్ల ఏమీ ప్రయోజనం లేదన్నాను.

ఊర్వ : అంతకన్నా ఏం చేసేది? వున్నవి రెండే మార్గాలు. విషం మింగడం-లేకపోతే యిదంతా అబద్ధమని బుకాయించడం.

రఘు : అబద్ధమని బుకాయిస్తావ్? అంత తేలిగ్గా పోయేదయితే నిన్నింత బాధపెట్టడం దేనికి? ఆ కాస్త అబద్ధం నేనే ఆడేసేవాణ్ణిగదూ!

ఊర్వ : మరి యిక విషం తప్ప వేరేమార్గ మేముంది?

రఘు : మార్గాలే లేకపోతయ్యా? అవి తెలుసుకునే తెలివితేట లుండాలిగాని!

ఊర్వ : మరి నా కేదయినా మార్గం చూపండి!

రఘు : చూపుతాను- కాని నువు మటుకు- అడ్డుప్రశ్నలు వెయ్యకుండా- నే చెప్పినట్టల్లా వినాలి.

ఊర్వ : వింటాను. మీరేం చేయమన్నా చేస్తాను. నా మధు నాకు దక్కితేచాలు. అతనే నా దైవం! అతనే నా ప్రాణం! నా సర్వస్వం అతనే! అతని పరిచయంతో నాలో ఒక గొప్పపరివర్తన వచ్చింది. నన్నొక దేవతగా ప్రేమించాడు. నేను కూడ నా జీవితాన్ని అతని ఆనందానికే అంకితం చేద్దామనుకున్నాను.

రఘు : [వెక్కిరింపుగా] అవునవును. చాలా బాగా అంకితం చేశావు!

ఊర్వ : [జాలిగా] అలా నిష్ఠూరంగా మాట్లాడకండి. నా గుండె చిమిక్కిపోతోంది. మీకు నమస్కారం చేస్తాను— నా మాట నమ్మండి—రామరాజుగారు నాకు చిన్నప్పటినుంచీ నాట్యం, సంగీతం నేర్పి నా కింత పేరు ప్రఖ్యాతులు సంపాయించి పెట్టారు. అన్నాళ్ల పరిచయాన్ని వున్నట్టుండి

ఒక్కసారి తెంచేసుకోలేక, కొంచెం చనువిచ్చాను. అదే నా ప్రాణంమీదికి తెచ్చింది.

రఘు : యీ తెలివి యింకొంచెం ముందు వుంటే!

ఊర్వ : అవును. నా జాలిగుండే నా ప్రాణంమీదికి తెచ్చింది. ఆయన్ని ఎలాగయినా వదిలించుకుందామని ఎంతో ప్రయత్నం చేశాను. అంత వయసొచ్చిన మగవాడు- కళ్లనీళ్లతో కాళ్లమీదపడి ప్రాధేయపడితే-....మర్యాదగా మంచిమాటలతో మభ్యపెట్టి పంపేద్దామనుకున్నాను. [రఘువైపు] అయినా నన్ను దేవతగా ఆరాధించే నా మధు నా కుండగా-ఆయనతో నా కెందుకుచెప్పండి. ఒట్టు! నామాట నమ్మండి. మధుకి నేనే ద్రోహమూ తలపెట్టలేదు. నన్నను మానించకండి.

రఘు : నిన్నను మానిస్తే-అసలు నిన్ను రక్షించాలని యీ తాపత్రయం దేనికి నాకు?

ఊర్వ : [అమాంతం లేచి రఘు కాళ్లమీదపడి బతిమాలుతూ] మీకు దణ్ణం పెడతాను. చచ్చి మీ కడుపున పుడతాను. నన్ను రక్షించండి. నా మధుని నాకు ప్రసాదించండి.

రఘు : తప్పేదేముంది. ఏదో ఒకటి చెయ్యాలి మరి- కాని నే చెయ్యబోయేదంతా నీ ముఖం చూచి కాదు-వాడి ముఖం చూచి! వాడు అథం శుభం ఎరగని అమాయకుడు. జీవితంలో ఆదర్శాలు-ఆనందం, ఆశ ఏవో కొన్ని వున్నయ్ వాడికి. అవన్నీ భగ్నమైపోయి, వాడిజీవితం ఎడారి

కావడం చూడలేకనే—యీ తాపత్రయం అంతా! కాని నువ్వు చేసినపనికి— మళ్లీ యీ ప్రపంచంలో తలెత్తుకుని తిరిగే యోగ్యత లేదు నీకు!

ఊర్వ : మీరెన్నన్నా సహిస్తాను. కాని నా కేదన్నా మార్గం చూపండి.

రఘు: : చూపిస్తాను, [అని లేచి ఫోను వద్దకు వెళతాడు. రిసీవరు తీసి] హల్లో! [ఊర్వశితో] కామరాజు Room నంబరు ఎంత ?

ఊర్వ : [భయంతో] ఆయనెందుకు ?

రఘు : [Phoneలో] కామరాజుగారి గదికావాలండి. (Pause) ఏమిటీ— లేపవద్దన్నారు? నీ కెందుకు, లేపవయ్యా! యిక్కడ ప్రాణంమీదకొస్తే....

ఊర్వ: ఆయనెందుకండీ యిప్పుడు?

రఘు: [ఫోనులోకి] కామరాజుగారూ!- క్షమించండి. మీకు నిద్రాభంగం కలిగించాం....నేను రఘుపతినండీ....ఆఁ- Room నెంబరు 4 నుంచి. రాత్రి కారులో వచ్చాం .. బాగా మెలుకవ వచ్చిందా?-ఆఁ- అర్జంటుగా మీ రొక సారి యిక్కడికి దయచేస్తారా? ఆఁ-యిప్పుడే-వెంటనే Room No. 4

[రిసీవరు పెట్టేస్తాడు, ఊర్వశి లేచి పోబోతుంది]

రఘు: ఎక్కడికి?

ఊర్వ: కామరాజుగారు వస్తే ....

రఘు: ఫర్వాలేదు: నువ్వుండవచ్చు.

ఊర్వ: [ఆగుతుంది. రఘు కూర్చుంటాడు. (Pause) ఊర్వశి మఘుగదికేసిచూసి] మధు! నన్నొక దేవతగా ప్రేమించాడు, నేనే తన సర్వస్వంగా భావించాడు. ఓ! అతని మొఖం నే నెలాచూసేది!

రఘు: ఆ మాత్రం జ్ఞానం రాత్రే వుంటే? [Slight Pause ]

ఊర్వ: ఏమండీ? ఏమాలోచించారు?

రఘు: వుండూ! తొందరపడితే ఎలా?

ఊర్వ: ఓ! అన్యాయం . కఠినంగా కామ పొమ్మనలేక మంచి కోసం మర్యాదకోసం-జారితలచినందుకు [అని చేతుల్తో ముఖం కప్పుకుని ఏడుస్తుంది]

[తలుపు చప్పుడు]

రఘు: Come in

కామ: [ప్రవేశం. మనిషి కొంచెం ఖంగారుగానే వుంటాడు. నడి వయస్సు. స్ఫురద్రూపి. నటుడి లక్షణాలుంటాయ్-నడకలో మాటలోగూడ] Good morning [ఊర్వశిని చూసి, ఆశ్చర్యంతో] ఓ, ఊర్వశీ! యిక్కడున్నావేం!

రఘు: యిప్పుడే వచ్చిందిలెండి.

కామ: అసలు విషయమేమిటి? ఏం జరిగింది?

ఊర్వ: కూర్చోండి.

రఘు: ఫర్వాలేదు. కాసేపాగితే ఆయనంతట ఆయనే కూర్చుం టాడు.

కామ: క్షమించండి. నాకేదో ఆందోళనగావుంది....

రఘు: కాసిని మంచి నీళ్ళివ్వమంటారా?

కామ: No, Thanks. పరగడుపున మంచినీళ్లు తాగనండీ!

రఘు: కామరాజుగారూ! మీరు పెద్దవారు. మీ రిలా పరాయివాళ్ళ భార్యల వెంటబడడం....

కామ: Nonsense! అబద్ధం, పచ్చి అబద్ధం!

రఘు: అంతేగదా! "నీకెందుకు పోవయ్యా" అంటావేమో నను కున్నాను. అలా అన్నా కొంచెం అందంగానే వుండును. కాని అబద్ధం అని బుకాయిస్తే-అంత తేలిగ్గా పోంతువా?

కామ: ఏమండోయ్. మీరు కొంచెం ఒళ్ళు దగ్గరపెట్టుకుని....

రఘు: Shut up!

కామ: 'Shut up'!

రఘు: 'మధుసం'-'మకరంద మాధుర్యం!' [కామరాజు అమాంతం కుర్చీలో కూలబడతాడు] నే నిందాకే చెప్పలా ఆయనం తట ఆయనే కూర్చుంటాడని. [కామరాజు గోడకేసి అదే పనిగా చూస్తుంటాడు] అవును. పాడుగోడలు మంచం తక్కువ.

కామ : యిదుగో రఘుపతిగారూ! మనలో మనం కీచులాడు కోవడం....

రఘు : ఏమిటీ?

కామ : ఆహాఁ. మీరు పెద్దవారు. కష్టసుఖాలు తెలిసినవారు. ఏదో ఆలోచించి....

రఘు : కూర్చోండి.

కామ : [ఆదుర్దాతో] ఏం- యింకేమన్నావుందా కొంపతీసి ?

రఘు : కూర్చోండి, చెబుతాను.

కామ : [కూర్చుంటాడు]

రఘు : వినండి. రాత్రి మీ సంభాషణంతా విన్నది నే నొక్కణ్ణే గాదు: ఆమె కాబోయే భర్త మధుకూడ నాతోటే వున్నాడు. వాడికి చెముడు గిముడూ ఏమీలేవు.

కామ : [Strang ling ] కాసిని మంచి నీళ్ళిస్తావూ?

రఘు : [లేచి. మంచినీళ్ళు తెచ్చియిస్తూ] పరగడుపున మంచి నీళ్ళేమిటండీ ?

కామ: అలవాటే లెండి. [తాగుతాడు]

ఊర్వ : యిప్పుడేం చేస్తారో చెయ్యండి. చూడండి మీ మొండి తనానికి పర్యవసానం ! నా జీవితం నాశనం జేశారు. నా కిప్పుడు ఆత్మహత్యే శరణ్యం. ఏనుయ్యో గొయ్యో చూచుకుంటాను.

కామ : [Melodramatic గాలేచి] నీతోపాటు నేనూ....

ఊర్వ : ఛీ ! యీ శిక్ష చాలదూ ! చచ్చినతరువాతగూడ యింకా వెంటాడి వేధించాలని వుందా ?

కామ : [రఘుతో ]మధుతో మాట్లాడి చూస్తే....

రఘు : సిగ్గులేక ఏమొఖం పెట్టుకుని మాట్లాడతావ్ ? ....పిచ్చి పిచ్చి వేషాలు మాని- యీ క్షణంనుంచి నువ్వు నా ఆజ్ఞ ప్రకారం నడచుకోవాలి.

రామ : ఆజ్ఞ

ఊర్వ : అవును. ఆజ్ఞే! [రఘుతో] ఆయన వాగుడు కేంలెండి - చెప్పండి.

రామ : నాది వాగుడా ! నా వాగ్ధాటినే ఆక్షేపిస్తూ....

రఘు : కట్టిపెట్టవయ్యా నీడాబులు! నే నింకా కనికరించి యీ మాత్రం సాయం చేస్తున్నందుకు సంతోషించు— యివిగో Telegramలు సిద్ధంగా వున్నయ్. నోరు ఎత్తావంటే- నీ భార్యకి Wire చేస్తాను. నీ ఆటకడుతుంది.

రామ : [తెల్లమొఖంవేసి గోడవంక పైకి కిందికి చూస్తాడు]

ఊర్వ : ఆయన వంక చూడండి. ఆ గోడలవంక ఎందుకు చూడ్డం. ఆ తెలివి రాత్రే వుండాలిసింది.

రఘు : రాత్రి- యీ ప్రక్కగదిలో- ఒక సంఘటన జరిగింది.

ఊర్వ : ఏం జరిగిందో మాకు తెలుసులెండి. దయచేసి....

రఘు : అదే మీకు తెలియచనేది. నే చెబుతున్నా తెలుసుకోండి. రాత్రి జరిగింది ఒక నాటకం రిహార్సలు!....అర్ధమయిందా?

ఊర్వ : అర్ధరాత్రివేళా ?

రఘు : ఆఁ- అర్ధరాత్రివేళే !

రామ : నాటక మేమిటి ? రిహార్సలేమిటి ?

రఘు : యీ గోడల్ని ఛేధించుకుని వచ్చేటంత బిగ్గరగా తమరు పలికిన పలుకులు ఒక నాటకంలోని సంభాషణలు- యిప్పు డైనా అర్థమయిందా ?

ఊర్వ: ఆఁ. అర్థమయింది. [కామరాజుతో] మీకింకా అర్థంకాలా? మట్టిబుర్రి [రఘుతో] ఆహా! ఎంత గొప్ప మేధావులండీ!

[అని లేచి రఘు దగ్గరకు పోతుంది]

రఘు: ఆఁ. ఆఁ. ఆగు!

ఊర్వ: కాని మధు నమ్ముతాడంటారా?

రఘు: ఏం, ఎందుకు నమ్మడూ?

ఊర్వ: ఆ సంభాషణలేవున్న నాటకం ఎక్కడ దొరుకుతుంది ?

రఘు: యిదుగో [అని తను రాసిన కాగితాలుతెచ్చి వూర్వశికి చూపుతాడు]

ఊర్వ: ఏమిటీ అది?

రఘు: నాటకం!

ఊర్వ: ఎవరు రాసింది?

రఘు: నేనే!-యివాళ ఉదయం-4,6 గంటల మధ్య రాసేశాను.

ఊర్వ: [సంతోషంతో] నిజంగానా?

రఘు: మరి రఘుపతి అంటే ఏమనుకొన్నావ్? అసలు నాటకకర్త అంటే అలావుండాలి. ఇందులో సగం నేను రాత్రి యీగోడ యివతలనుంచి విన్నదీ-మిగతా సగం అందుకు అనుగుణంగా నేను కల్పించి వ్రాసింది!- కామరాజుగారి కవిత్వం కొంత! మన పైత్యం-కొంత. భగ్నంకాబోయే రెండు నిండు

జీవితాల్ని నా నాటకరచనా చాతుర్యంవల్ల రక్షించే అవకాశం లభించినందుకు ఆనందంతో నా హృదయం పుల్రూతలూగుతోంది. యింత పవిత్ర మహదాశయంతో వ్రాయబడిన నాటకం ప్రపంచంలో మరొకటి లేదనే నా నమ్మకం!-యిదుగో నాటకం! చదవండి! కంఠస్థం చెయ్యండి! ప్రదర్శించండి!

ఊర్వ: ప్రదర్శించడమా?

రఘు: ఆఁ, లేకపోతే, రాత్రిది రిహార్సలని మధుని నమ్మించడమెలాగ? యివాళ సాయంత్రం 5 గంటలకు Dress-rehearsal; రాత్రికి ప్రదర్శనం!

కామ: యివాళ రాత్రికా? ఎక్కడ?

రఘు: V. P. Hall లో [పూర్వశితో] అన్నట్టు, యివాళ విజ్ఞాన సమితి వార్షికోత్సవంలో మీ Programme వుందిగా!

ఊర్వ: ఒక నృత్యనాటిక వుంది.

రఘు: దాం దేముందిలే. Programme కొద్దిగా మార్చాలని Theatre వాళ్ళకి Phone చెయ్యి. నృత్య నాటికకు బదులు మామూలు నాటిక వుంటుంది.

కామ: కాని, సాయంత్రంలోగా యీ పోర్షనంతా ఎలావస్తుందండి?

రఘు: అందులో సగం రాత్రి తమరు చెప్పిందేగదండి!

ఊర్వ: అయితే-తెల్లవారుఝామున 3 గంటలప్పుడు రిహార్సలు వెయ్యాలిసిన అవసరమేమిటి?

రఘు: ఆ అనుమానం నాకూ వచ్చింది. కాని తగు సమాధానం చెప్పుతున్నాను. ఏముంది? యివాళ రాత్రికి నాటకం ప్రద ర్శించాలి. నిన్నంతా Picnic హడావుడిలో వున్నారు. రిహార్సలుకు time లేకపోయింది. కాబట్టి ఎంత ప్రొద్దు పోయినాసరే Picnic నుంచి రాగానే ఒక rehearsal వేసుకోవాలని నిశ్చయించుకున్నారు. Picnic నుంచి వచ్చారు. Rehearsal వేసుకున్నారు, అంతే!

ఊర్వ : అయితే యిక నే వెళతానండి. అందులో నాకు Portion గూడ త్వరగా రాదు!

రఘు : ఆఁ- ఒక్క నిముషం! V. P. hall మేనేజరు ఎవరు ?

ఊర్వ : శివశంకరంగారు !

రఘు : ప్రోగ్రాం మారిందని ఆయనకు చెప్పొద్దూమరి ! [Phone దగ్గర కెళతాడు] Hello! V. P. Hall manager శివశంకరంగారు కావాలండి.

ఊర్వ : ఆయ నింకా నిద్రలేచి వుండరండీ !

రఘు : Phone bell అదేపనిగా మోగిస్తే ఆయనే లేస్తాడు. ఆఁ. [రిసీవరు ఊర్వశి కిచ్చి] Ladies first!

ఊర్వ : ఏం మాట్లాడను ?

రఘు . నీ కెందుకు—ప్రక్కన నేను Prompt చేస్తాగా!

ఊర్వ : హల్లో ! శివశంకరంగారేనా ? .... అవును. ప్రొద్దున్నే పిలవాలసివచ్చింది. [రఘుకేసి చూస్తుంది ఏం మాట్లాడా లా అని]

రఘు : Good morning

ఊర్వ : [Phone లో] Good morning

రఘు : రాత్రి బాగా నిద్రపట్టిందా ?

ఊర్వశి : [రిసీవరు చేత్తో మూసి] ఆయన అపార్థం చేసుకుంటా దేమోనండి !

రఘు : అయితే మరి నీ యిష్టమొచ్చినట్టు మాట్లాడు.

ఊర్వ : [వయ్యారంగా Phoneలో] హల్లో, శివశంకరంగారూ! పాపం! మీకు నిద్రాభంగం కలిగించాను. క్షమించండి. ఒక ముఖ్యవిషయం. రాత్రి ప్రోగ్రాంలో ఒక మార్పు వచ్చిందండీ. క్షమిస్తారుగదూ! సమితి సభ్యులందరినీ-క్షమించమని నా మాటగా చెప్పండి. సరే. ప్రేక్షకులు ఎలాగూ క్షమిస్తారు !

రఘు : ఓ. అంతా ఏకగ్రీవంగా క్షమిస్తారు.

ఊర్వ : నృత్యనాటికకు బదులు ఒక చరిత్రాత్మక నాటిక వుంటుంది. చిన్నదే లెండి. నేనూ రామరాజుగారు నటిస్తాం. చాలా బాగుంటుంది. [కాసేపు వింటుంది. తరువాత రఘుతో అదే ధోరణిలో] ఏం నాటకమండి అది ?

రఘు : బెంగాలీ నాటకం !

ఊర్వ : [Phone లో] బెంగాలీ నాటకం [రఘుతో] వ్రాసిం దెవరు ?

రఘు : టాగూర్ ! టాగూర్ !

ఊర్వ : అఁ, టాగూర్ అనుకుంటానండి ! [ Pause ] .... ఓహో ! అలాగా !

రఘు : ఏమిటి 'అలాగా' ?

ఊర్వ : [ రిసీవరు మూసి ] ఆయన టాగూర్ నాటకాలన్నీ చదివాట్ట !

రఘు : చచ్చాం! అయితే టాగూర్ కాదు. D. L. Roy. ద్విజేంద్ర లాల్ రాయ్.

ఊర్వ : [Phone లో] కాదండి ! క్షమించాలి. యిప్పుడే script చూశాను. అది వ్రాసింది టాగూర్ కాదు; D. L. Roy. ద్విజేంద్రలాల్ రాయ్.

రఘు : ప్రఖ్యాత చరిత్రాత్మక నాటకకర్త. D. L. Roy.

ఊర్వ : ప్రఖ్యాత చరిత్రాత్మక నాటకకర్త. D. L. Roy .... అలాగా ?

రఘు : యీసారి ఏమంటున్నాడు ?

ఊర్వ : D. L. Roy నాటకాల్లో " మృచ్ఛకటిక " ఒక్కటే చదివాట్ట !

రఘు : వాడి బొంద !

ఊర్వ : వాడి బొంద ! [Phone లో]

రఘు : అహఁ హఁ [అని వారిస్తాడు]

ఊర్వ : [నాలికకరచుకుని] ఆ, సెలవు. నమస్కారం !-ఓ తప్పు కుండాను. మీరే Prompterగా వుంటానంటే—యింకా మాక్కావలసిందేముంది....నాటకం పేరా ?

రఘు : 'ప్రతీకారం'

ఊర్వ : పతికారం.

రఘు : 'పతి'గాదు. 'ప్రతీ' 'ప్రతీకారం'.

ఊర్వ : 'పతి'గాదు, ప్రతీ—'కారం'. ప్రతీకారం. ....ఆఁ.సెలవు నమస్తే [Phone పెట్టేస్తుంది. రఘుతో] బెంగాలీ నాటక మన్నా రేమండీ ?

రఘు : రాసిందెవడో ఎవడికీ తెలీకుండావుంటానికి ! బెంగాలీ సాహిత్యంలో గొప్పదనం అదే అసలు ! అదీగాక-బెంగాలీ సాహిత్యానికి నేను చాలా ఋణపడివున్నాను. యిది వరలో బెంగాలీ నాటకాలనుంచి చాలా దొంగిలించాను. ఆ ఋణం యీవిధంగానైనా తీర్చుకుందామని ప్రయత్నం. —ఆఁ- కామరాజుగారూ ! నావ్రాత చూస్తే- మావాళ్లు గుర్తుపడతారుగాని—దీనికి Fair copy వ్రాయండి.

కామ : ఏమిటీ ? యిదంతానా ?

రఘు : ఆఁ. మొదటినుంచి చివరిదాకా !

కామ : చాలా కష్టమండీ ?

రఘు : రెండు కాపీలు తయారు చెయ్యండి.

ఊర్వ : [Script చూస్తూ] యిదిగో, యిది తప్పండి. యీ వాక్యం "కోరివిదయ్యాల్లా మీకళ్లు చూడండి ఎంత ఎర్ర బడినయ్యో" నే నన్నది అది కాదండి.

రఘు : "నిద్రలేక మీ కళ్లు చూడండి ఎంత ఎర్రబడినయ్యో!" అన్నావు. నాకు జ్ఞాపకంవుంది, కాని ఆమాటలు మీ రన్న

ప్పుడు మధు యిక్కడలేడు. కాబట్టి అవి ఎలావున్నా ఫరవాలేదు.

కామ : అయినా నా కష్ట కొరివిదయ్యాలని వర్ణించడంలో మీ అభిప్రాయమేమిటో అడగవచ్చా ?

రఘు : చెప్పానుగదూ ! మీ కవిత్వం కొంత - నా పైత్యం కొంత అని. అది నా పైత్యంలో ఒక భాగం.

కామ : అది సరే, అసలు నా కళ్లని అలావర్ణించడంలో మీ ఉద్దేశం ?

రఘు : నా కలా తోచింది. రాశాను. నేను కవిని ! నిరంకుశుణ్ణి. కాదనడానికి నువ్వెవడివి ?

ఊర్వ : అప్పుడు మీరు దగ్గో, సకిలింగో చప్పుడు చేస్తే, మేం విని జాగ్రత్తపడేవాళ్లం గదండీ ?

రఘు : మీరు జాగ్రత్తపడి మధ్యలోనే ఆపారనుకోండి- అపుడు యీ పథకం అంతా ఎలా సాధ్యమయ్యేది ?- అదీగాక —నీ మొదటి వాక్యాల్లోనే విషయం అంతా స్పష్టంగా తెలుస్తూండె. యిక మధ్యలో ఆపితే మటుకు ఏం ప్రయోజనం ?

కామ : ఆహాహా ! నిజంగా మీది ఏం బ్రెయినండి ?

రఘు : ముఖస్తుతి !

ఊర్వ : కాదండి. ఆయన చెప్పేది అక్షరాల నిజం .... ఏమండి, మీ కీ Plan మా మాటలు వినగానే తట్టిందాండి ?

రఘు : మీ మాటల ధోరణే నాకు మార్గం చూపింది.

ఊర్వ : అంటే,

రఘు : నేను సామాన్యంగా ఎవరిని అనుమానించను. మొదట మీ సంభాషణ విని — ఏదో నాటకంలే అనుకున్నాను. కాని తరువాత తెలిసింది చాలా పొరబడ్డానని.

ఊర్వ : మా సంభాషణ విని నాటకమని ఎలా అనుకున్నారండీ ?

రఘు : ఆభాష అలావుంది మరి. అంత artificial గా—తెచ్చి పెట్టుకున్న అనురాగంతో—మరీ ఆ వుద్రేకంలో జరిగిన సంభాషణలు.

ఊర్వ : అవును. తెచ్చిపెట్టుకున్న అనురాగమే. లేకపోతే నా కాయనమీద ప్రేమ వుంటేగా !

కామ : ఏమిటీ ?

ఊర్వ : వినబళ్లా ?

కామ : నామీద నీకు ప్రేమ లేదూ !

ఊర్వ : లేదు.

కామ : అయితే రాత్రిదంతా ఒట్టి నాటకమేనన్నమాట.

ఊర్వ : ఆ.

కామ : నా పీడ వదలించుకోడానికి ఎత్తువేశావ్ ?

ఊర్వ : అవును, మిమ్మల్ని చూస్తేనే అసహ్యం వేస్తోంది.

రఘు : కళ్లంట నీరు గార్చే మొగాణ్ణి, ఏ ఆడది మట్టుకు ఎలా ప్రేమిస్తుంది.

కామ : సరేగాని — మా సంభాషణ 'నాటకంలోది కాదు—నిజమే' నని ఎలా అనుకున్నారు ?

రఘు : ముఖ్యం తమ భాషవల్ల. కాస్త ప్రతిభవున్న నాటకకర్త యెవ్వడూ అంత చెత్త dialogues రాయడు.

కామ : నే మాట్లాడింది చెత్తా ? [బిగ్గరగా]

రఘు : పరమ చెత్త !

కామ : ఏమండోయ్ ! నాకూ కొంచెం చదువు, సంస్కారం—

రఘు : Shut up !

కామ : [ఆగిపోతాడు]

రఘు : మావాళ్లు వచ్చేస్తారేమో—మీరు త్వరగా వెళ్లి పోర్షన్లు చదువుకోండి. [ఊర్వశి కాగితాలు తిరగేస్తుంటుంది] ఊర్వశీ ! ఆ భాగం మటుకు క్షుణ్ణంగా చదువు.

ఊర్వ : ఏ భాగం ?

రఘు : అవే ! మేం యీ గదిలోనుంచి విన్న dialogues [script లో చూపిస్తూ] యిక్కడి నుంచి యిక్కడిదాక. రాత్రి ఏ విధంగా అన్నారో—రిహార్సల్లోగూడా అలాగే అనాలి. జాగ్రత్తగా గుర్తుంచుకోండి. — వెళ్లండి. Fair copy వ్రాసి, కంఠస్థం చేసి, రాత్రికి ప్రదర్శించండి. రిహార్సలు 5 గం॥లకి. ఆఁ - మరొక విషయం. మనం యిప్పుడు కలుసుకున్నట్లు ఎవరికీ తెలీగూడదు. అప్పటి కప్పుడే కలుసుకున్నట్టు ప్రవర్తించాలి. తెలిసిందా ? జాగ్రత్త!

ఊర్వ : అలాగే, వస్తాం మరి. సెలవు. [వెళుతుంది]

కామ : [తేరిపారజూచి] ఆహా ! మీది ఏం బ్రెయినండీ !

రఘు : Thank you [కామరాజుగూడ వెళ్లిపోతాడు. రఘు ఫల హారం ముందు కూర్చుని వుపక్రమిస్తాడు. యీ సీనులో చివరిదాకా తాపీగా, సుష్టుగా తింటూనే వుంటాడు. ప్రవేశం రామానుజం. విచారంగా వుంటాడు. ]

రామా : రాత్రి చాలా సేపు మేలుకున్నావేంరా ?

రఘు : అసలు నిద్రపట్టందే ! [తింటూనే] మధు ఎలా వున్నాడు ?

రామా : యింతకుముందే లేచాడు. మొఖం కడుక్కుంటున్నాడు.

రఘు : ఊఁ– కానీయ్ [అని ఫలహారంవేపు చూపుతాడు]

రామా : మ్చ్. సహించడం లేదురా ! నువ్వెమటుకు మామూలుగానే పుచ్చుకుంటున్నావ్ ?

రఘు : యీ తనువుకోసమైనా తినాలిగా మరి !

రామా : ఓరి నీ తిండి పాడుగాను. యింత అఘాయిత్యం జరిగితే – అసలేమీ జరగనట్టు, నిర్విచారంగా ఎలా సహిస్తోందిరా ఆతిండి !

రఘు : అరే నీకో రహస్యం చెప్పనా ? (Serious గా)

రామా : ఏమిటది ?

రఘు : నేను మాటలు తూచిమాట్లాడే మనిషిని. వ్యర్థప్రసంగాలంటే నాకు గిట్టవు. చెబుతున్నాను. యిలాంటి సాంబారు నాజన్మలో ఎక్కడా తాగలేదు.

రామా : [విసుగ్గా] ఛా నోరుముయ్ !

రఘు : ఆహాహా [అని ఆప్యాయంగా భోంచేస్తుంటాడు] మధు అసలు నిద్రపోయినాడా ?

రామా : ఏడ్చి ఏడ్చి అలసి, ఏదో ఒక అరగంట నిద్పు పోయాడు.

రఘు : ఏమంటున్నాడు ?

రామా : అసలు జవాబు చెప్పందే. వెల్లికల పండుకొని, యింటి కప్పుకేసి కన్నార్పకుండా చూస్తుంటే—నాకు భయం వేసింది. అది అట్టేమంచిలక్షణం కాదని, మా అమ్మమ్మ చెబుతుండేది.

రఘు : పైకప్పుకేసి చూస్తే ఫరవాలేదుగాని—గోడలకేసి చూస్తే నేరా మరీ ప్రమాదం.

రామా : యింత బ్రహ్మాండమైన Building కట్టినవాళ్లు, గోడలు యింత మందం తక్కువ బెట్టారేమబ్బా !

రఘు : [తింటూనే] ఇక్కడSoil కొంచెం loose soil. Buildingబరువెక్కువయితే—Crockయిస్తుందనీ....

రామా : యిక చాల్లే అపరా తిండి. [అని లేస్తాడు]

రఘు : అహఁ. యిదంతా Waste అయిపోదూ ?

రామా : [అద్దంలో చూచుకుని] అరె. నా మొఖం ఒకరోజుకే యిలా తెల్లగా పాలిపోయిందేరా !

రఘు : మంచిదే! బుద్ధి వికసిస్తోందన్న మాట !

రామా : రాత్రి ఏదో Plan ఆలోచిస్తానన్నావ్, ఏం జేశావురా ?

రఘు : ఒకటేమిటి, డజను Planలు తయారుజేశాను. రాత్రంతా మేలుకొని, వాటినన్నిటినీ నాలో నేను చర్చించుకొని, చివరికి ఒక Plan finalగా fixచేసాను.

రామా : ఏమిటది ?

రఘు : మధుకి, ఊర్వశికి ఎలాగయినా వియోగం కలిగించాలి.

రామా : ఎందుకు ?

రఘు : వియోగం తరువాత కలిగే సంయోగానికి Dramatic effectఎక్కువ : మొదట వాడు ఆమెను పూర్తిగా తిరస్కరించి వెళ్లిపోవాలి. కొద్దిరోజుల వియోగం తర వాత వాడిలో విరహం ప్రకోపిస్తుంది. తిరిగివచ్చి ఆవిడ పాదాలమీద బడి ప్రాధేయపడతాడు. మొదట్లో ఆవిడ కొంచెం బెట్టుచేసినా, తరవాత మెత్తబడుతుంది. అతను యింకా ప్రాధేయపడతాడు. ఆమె యింకొంచెం మెత్త బడుతుంది. మెత్తబడి మెత్తబడి క్రమంగా కరిగి నీరై పోతుంది. Final గా ప్రేమీ ప్రేమికులు గాఢపరిష్వం గంలో వుండగా తెర దీనంగా పడుతుంది.

రామా : రాత్రంతా కూచుని ఆలోచించిన దిదన్నమాట ?

రఘు : అవును.

రామా : నీకు వున్నకొద్దీ మతి పూర్తిగా పోతోందిరా ? పసి వెధవ అవతల వాడు గుండె పగిలి చావుకు సిద్ధంగా వుంటే— నువ్వేమో వియోగం సంయోగం అని dramatic effect లు ఆలోచిస్తున్నావ్ ?

రఘు : యిశ్శ్! మధు వస్తున్నాడు. [మధు ప్రవేశం. చాలా నీర సంగా, విచారంగా వుంటాడు. వీళ్లని చూడనైనా చూడ కుండా బయటికిపోబోతాడు.] మర్యాదకైనా మాట్లాడదేరా?

మధు : ఓ! good morning బాబాయ్ !

రామా : కాఫీ తీసుకున్నావా నాయనా !

మధు : ఉహూఁ [నీరసంగా]

రామా : [నీరసంగా వెళ్ళి ఫలహారాలవద్ద కూర్చుంటాడు]

రఘు : రాత్రి ఏమయినా నిద్ర పట్టిందా ?

మధు : ప్చ్ !

రఘు : నాకూ అంతే! కంటిమీద కునుకులేదు.

మధు : [గోడకేసి చూస్తాడు]

రఘు : మళ్లీ ఏమీ హడావుడిలేదు. ఆతగాడు వెళ్లిపోయాడు. ఆవిడ చక్కగా నిద్రపోయింది. ఎటుతిరిగీ—నాకే లేక పోయింది గాని-నిద్ర !—[రామానుజంకేసి] ఏఁరోయ్ ! ఆకలి యిప్పుడే అందుకుంటున్నట్లుంది.

రామా : ఎబ్బె ! అసలు మింగుడు పడందే !

రఘు : సాంబారు కాస్త జాస్తీగా తగిలించు !

మధు : బాబాయ్ ! యీనాటితో నా జీవితం భగ్నమైపోయింది. యిక నావల్ల మీ యిద్దరికి అనవసరంగా శ్రమ యివ్వ దలచుకోలేదు.

రఘు : వూరుకోరా ! అలా నిరుత్సాహపడకు !

మధు : నిజం బాబాయ్ ! బాగా ఆలోచించే చెబుతున్నాను. యీ Shockతో నాహృదయం ఒక పెద్ద crackయిచ్చింది.

రఘు : అటువంటప్పుడే ధైర్యంతో ఆలోచించాలి. యింతకీ యిప్పుడు ఏం చెయ్యడానికి నిర్ణయించుకున్నావ్?

మధు : ముందు యీ వూరునుంచి వెంటనే వెళ్లిపోవాలి.

రఘు : Right, బాగానేవుంది : తరువాత ?

మధు : ఊర్వశిమీద నేను వ్రాసిన ప్రణయ గీతాలన్నీ ముక్కలు ముక్కలుగా చించేసి, తగలేశేస్తాను

రఘు : అవీ బాగానేవుంది. తరవాత ?

మధు : అంత తేలిగ్గా తేల్చేస్తావేం బాబాయ్ : మీ యిద్దరికంటే ఆప్తులు నా కింకెవరున్నారీ ప్రపంచంలో. యివాళ మీరే లేకుంటే–నే నీపాటికి అమాంతం పొడుచుకు చచ్చిపోయే వాణ్ణి.

రఘు : స్థిమితంగా కూర్చుని, నే చెప్పేది విను : [మధు కూర్చుంటాడు.] అయిందేదో అయిపోయింది. గతించింది తిరిగి రాదుకదా! నువ్వు నవయవ్వనంలో వున్నావ్. గొప్ప భవిష్యత్ గలవాడివి. యీ ప్రపంచం అంతా నీ ప్రతిభకి పాదాక్రాంతమవుతుంది. యీ ప్రపంచంలో ఊర్వశిని తలదన్నిన అప్సరసలు లక్షలకొద్దీ వున్నారు.

మధు : ఎంతమంచి వుంటేఏం–నా క్కావలసింది ఊర్వశి ! – వద్దు బాబాయ్! మనం తక్షణం యిక్కడినుంచి వెళ్ళిపోదాం. నేనిక దానిముఖం చూడలేను.

రఘు : అలాగే వెళ్ళిపోదాం! కాని ఒక్కవిషయం ఆలోచించు : మీరిద్దరూ ప్రేమించి పెళ్ళిచేసుకోబోతున్నారని లోకానికంతకీ తెలుసా ? అలాంటప్పుడు–నువ్వు యిప్పుడు వున్నటుండి వెళ్లిపోతే–ఏమనుకుంటారు ?

మధు : అయితే——

రఘు : అంటే దానితో రాజీపడి-పెళ్లిచేసుకోమనిగాదు నే ననేది! ప్రస్తుతానికి—ఏమీ జరగనట్టుగానే -ఆవిడతో మామూలుగా ప్రవర్తించు. రాత్రికి వాళ్ల నాటకం వుంది. అది చూసి రేపుప్రొద్దున గప్‌చిప్‌గా వెళ్లిపోదాం.

మధు : అలాగే బాబాయ్!

రఘు : రేపింటికి వెళ్లి- ఊర్వశికి ఒక పెద్ద వుత్తరం వ్రాయి. అందులో నీ కసిఅంతా తీర్చుకో ; పీడావదలిపోతుంది.

మధు : సరే బాబాయ్.

రఘు : ఊర్వశి కనబడగానే— అనవసరంగా వుద్రేకపడవుగదూ?

మధు : అబ్బే !

రామా : ఆ ప్రణయగీతాలన్నీ యిప్పుడే చించెయ్యకు. తరవాత చూచుకోవచ్చు.

మధు : మీరింత చెప్పింతరవాత-నే వినకుండా వుంటానా బాబాయ్! మీ యిష్టప్రకారమే కానివ్వండి.

రామా : [భోజనం ముందు కూర్చుంటూ] అబ్బ ! సగం భారం తగ్గిందిరా ! యిక నిశ్చింతగా భోంచెయ్యొచ్చు.

రఘు : మధు ! రా , నువ్వుకూడా ఫలహారం తీసుకో.

రామా : వాడు అప్పుడే తినలేడులే ! యింకొంచెం Time పడు తుంది స్థిమితపడడానికి.

రఘు : అబ్బే ! అలావీల్లేదు. రా ! [అంతా కూర్చుంటారు. తిండి ఆరంభం]

[రఘుపతి ఆలోచిస్తుంటాడు]

రామా : యింకొంచెం వెన్న రాసుకో.

మధు : అహఁ. అక్కర్లేదు. ఒట్టి కాఫి తాగుతా, చాలు.

రామా : సరె [అని తింటుంటాడు. రఘుపతితో] ఏమిట్రా అలా దిగాలుపడి దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ ?

మధు : నాకు ధైర్యంచెప్పి, నువ్వే మళ్లీ దిగాలుపడుతున్నావా బాబాయ్ !

రామా : దిగాలుకాదు. మళ్లీ ఏదో—

రఘు : బాగా కనిపెట్టావ్‌రా ! మళ్లీ ఒక సమస్య !

రామా : నాటకాల సంబంధమేనా ?

రఘు : మరి ?

రామా : చంపావ్ ?

రఘు : రాత్రి—నాటకాన్ని ఎలా ప్రారంభించడమా అని ఆలోచించాను. యిప్పుడు రెండో అంకం ముగించడం ఎలాగా అని ఆలోచిస్తున్నాను.

రామా : అఘోరించావ్ ! ముందు Tiffin కానియ్యవోయ్ !

రఘు : అహఁహఁ—ఇది చాలా Interesting : యీ సన్నివేశమే వుందనుకోండి :—రాత్రిలాగా ఆలోచించి చూడండి. మన కొక అపూర్వమైన అనుభవం కలిగింది. రాత్రి యిక్కడికి మనం సుఖంగా చేరుకున్నాం—కాని వెంటనే మనకొక పెద్ద Shock తగిలింది. అయినా మనం ధైర్యం చిక్కబట్టి, తెలివితేటల నుపయోగించి,

ఎలాగో నిలదొక్కుకోగలిగాం—ఇది మన వాస్తవజీవితంలో గాకుండా—స్టేజీమీద ఒక నాటకంలో జరిగిందనుకోండి. మనముగ్గురమే ఆ నాటకంలో పాత్రలమనుకోండి. మనకి కలిగిన అనుభవాలే వాళ్లకీ కలిగాయి అనుకోండి.

రామా: అయితే ఏమంటావ్ ?

రఘు : అప్పుడు యీ సీను ముగించడం ఎలాగ అని !

రామా: మనం ముగించేదేమిటి ? దానంతట అదే ముగిస్తే !

రఘు : ఒక విధంగా ముగిసినట్లేననుకో. కాని Dramatic effect కావాలంటే-తెర పడేముందు కొంత Suspense create కావాలి. తరువాత ఏం జరుగుతుంది అనే కుతూహలం కలగాలి ప్రేక్షకులకి. కాబట్టి, రామానుజం: అలాంటి suspense సృష్టించాలంటే యీ scene ఎలా ముగించాలో చెప్పు.

రామా: ఏముంది, చాలాతేలిక ! మన ముగ్గురం ఫలహారాలు తింటూంటాం. తుఫాను వెలసింతరువాత, ఆకాశం అంతా నిర్మలంగా వుంటుంది. ముగ్గురం కాఫీ గ్లాసులు చేతబట్టి గతించిన అనుభవాలను ఒక క్షణంసేపు నిశ్చబ్దంగా స్మరించుకుంటాం. తరువాత రెండుమూడు చక్కని వాక్యాలు [ఆలోచించి మధుదగ్గరకెళ్ళి] నాయనా ! యీనాడు నిజంగా నీవు గుండెగల మొగాడివని నిరూపించుకున్నావు. నీ ధైర్యస్థైర్యాలకు చాలా గర్వపడుతున్నాను. జీవితంలో మన ధైర్యస్థైర్యాలను, గుండె

బలాన్ని పరీక్షించేవి పరాజయాలే గాని, విజయాలు కావు. నీ చిత్తస్థైర్యాన్ని ప్రకటించే అవకాశం కల్పించిన ఆ ధూర్తురాలు ఊర్వశికివే నా జోహార్లు [అని గ్లాసు పైకెత్తి] Curtain !— ఎలావుంది ?

రఘు : ఏడిసినట్టుంది ! [పదే కర్టను మళ్ళీ పక్కకిపోతుంది] వుప్పులేని పప్పులాగా వుంది. అలా ముగించకూడదని గాదు. అదీ ఒక పద్ధతే !-కాని suspense ఏది? [Pause] ఆ, మధూ నువ్వయితే ఎలా చేస్తావో చెప్పు.

మధు : నేనా ? ఏం చెప్పేది బాబాయ్ యీ స్థితిలో.

రఘు : ఏంతోస్తే అదే చెప్పు.

మధు : రామానుజంగారి ఆఖరి వాక్యం........

రామా: ఆఁ, ఆ ధూర్తురాలు ఊర్వశికివే నా జోహార్లు !

మధు : దారుణం ! ఆ నీచురాలికా జోహార్లు ! [అని గ్లాసు విసరి కొడతాడు]

రామా! చాలా బాగుంది ! వాస్తవికత ! అతి వాస్తవికత !

మధు : [వుద్రేకం ఎక్కువై, ఒళ్లు మరచి] ఆమె నా హృదయ పాత్రనిండా విషాన్ని నింపింది. ఆమెతో - ఏమీ జరగ నట్టే - మామూలుగానే ప్రవర్తించమంటాడు బాబాయ్ ! కాని ఎలా ప్రవర్తించేది ? నా ప్రణయాధి దేవతగా ఆరాధించిన స్త్రీ మరో పురుషుని కౌగిట్లో .... అబ్బ ! భరించలేను. తల్చుకుంటే గుండె రగిలిపోతోంది. ఇక నాకు ఇదొక్కటే శరణ్యం. [అని టేబిల్‌మీద రొప్టెలు

కోసే క త్తి తీసి పొడుచుకోబోతాడు.]

రఘు : ఆఁ, ఆగు. [అని పట్టుకుంటాడు]

రామా: ఏమిటి నిజంగానే.........

మధు : న న్నాపకండి, వదలండి [అని పెనుగులాడతాడు. రఘు క త్తిలాగుకుని ఎగాదిగా చూస్తాడు. మధు వగరుస్తూ నిలబడి చూస్తుంటాడు]

రఘు : ఏమిట్రా నీ వుద్దేశం ?

మధు : ఏముంది? యీ జీవిత నాటకాన్ని ముగిస్తాను. [అని కూర్చుంటాడు. రామానుజం కూర్చుంటాడు] [నిస్సా రంగా] Curtain !

రఘు:[Curtain మెల్లగా వాలుతుంటే, చేత్తో సంజ్ఞచేసి ఆపుతాడు] Very bad, Very bad. చాలా పేలవంగావుంది. ఆరే My dear Madhu ! ఒక మొండిక త్తితో — రెండో అంకంలోనే Hero ని చంపించేస్తే - యిక నాటకంలో Interest ఏముంది ? పైగా నాటకరంగంమీద ర క్త పాతం మన సాంప్రదాయాలకి విరుద్ధం. విమర్శకు లూరు కుంటారా ? ఠకీమని పీక పట్టుకుంటారు. కాబట్టి రెండో రంగం ముగింపులో కావలసింది suspense!

రామా: ఆ Suspense ఏమిటో నువ్వే చెప్పరాదూ! మా ప్రాణాలు తీయకపోతే !

రఘు: [Phone దగ్గరకెళ్లి]హల్లో! ఊర్వశి కావాలండి.[Pause]

ఊర్వ : ఏమిటీ ?

రఘు : హల్లో ! ఊర్వశేనా ?

ఊర్వ : అవును. ఎవరు మాట్లాడేది ?

రఘు : ఏం, నాగొంతు గుర్తుబట్టలా ? నేను రఘుపతిని !

ఊర్వ : [ఆశ్చర్యంతో] ఓ ! మీరా ? ఎప్పుడొచ్చారూ ? యిప్పుడెక్కడనుంచి మాట్లాడుతున్నారు ?

రఘు : యీ ప్రక్కగదిలోనుంచే Room No 4.

ఊర్వ : అనుకోకుండా, అకస్మాత్తుగా వచ్చేశారు ?

రఘు : రాత్రి కారులో వచ్చాం ! ముగ్గురం !

ఊర్వ : ఏమిటీ ? మధుగూడా ?

రఘు : ఆఁ. మధు, రామానుజం, నేనూ !

ఊర్వ : ఓ! చాలా సంతోషం !

రఘు : ఇంత ప్రొద్దున్నే నిన్ను లేపాలా వద్దా అని సంకోచిస్తున్నాము. కాని, పని కొంచెం ముఖ్యమయింది కాబట్టి లేపక తప్పలేదు. నువ్వొకసారి యిక్కడికి రాగలవా ?

ఊర్వ : వొస్తున్నా ! [Pause. ప్రవేశం తెచ్చిపెట్టుకున్న సంతోషంతో] ఓ ! నమస్తే ! అనుకోకుండా వచ్చేశారే ! చాలా ఆనందంగావుంది. ఓ! మధు! [అని దగ్గరకువెళ్ళి రెండుచేతులూ పట్టుకుని] మనం కలసుకుని....

రఘు : పదిహేను రోజులకి పైగా అయింది.

ఊర్వ : ఏమో! నాకు పదిహేను యుగాలుగావుంది....మధు! కొంచెం చిక్కిపోయినట్టున్నావే ?.... [వయ్యారంగా లాలిస్తుంది]....ఏమండీ రామానుజంగారు! బాగున్నారా? ....

మీరు ఎప్పుడు వస్తారా ఎప్పుడు వస్తారా అని ఎంతగానో ఎదురు చూస్తున్నాను. రాత్రి ఎన్నిగంటలయింది మీరు వచ్చేసరికి ? [అప్పుడే కామరాజు వరండాలోగుండా వెళుతూంటాడు.]

రఘు : హల్లో కామరాజుగారు ! తమ రొకసారి దయచేస్తారా ?

కామ : [ప్రవేశం జంకుతూ. Pause ] Good morning!

రఘు : సమయానికి మీరుకూడ యిక్కడే వున్నారే ?

కామ : నిన్న ఉదయమే వచ్చానండి. మళ్ళీ తిరిగి వెళ్లేవాణ్ణే, కాని నిన్న Picnic కి వుండమని Friends బలవంతంచేశారు. యివాళ వెళ్ళిపోతున్నాను.

ఊర్వ : యివాళ వెళ్ళరులెండి. రాత్రికి చిన్న నాటకంవుంది. నేనే వుండమన్నాను.

కామ : అవునవును. మరచిపోయా! యీ రాత్రికుండి రేపెడతాను.

రఘు : [విచారంగా] కాని మీ ఆనందాన్ని భగ్నపరుస్తూన్నందుకు నాకు చాలా విచారంగా వుంది.

ఊర్వ : ఏమిటీ ? ఏదన్నా చెడ్డవార్త కాదుగదా !

రఘు : అవును. చెడ్డవార్తే! కాని చెప్పక తప్పదు. [అందర్నీ కూర్చోమని చేతులూపుతాడు. అంతాకూర్చుంటారు]

రఘు: మేము రాత్రి ప్రొద్దుపోయి ఇక్కడికి చేరాం. యింతకు ముందే-మేంముగ్గురం - ఫలహారాలు తీసుకుందామని కూర్చున్నాం: [రామానుజంతో] అంతేగదరా? ముగ్గురు మేగా?

రామా: అవును.

మధు: అయితే?

రఘు: ఉష్! Silence. ముగ్గురం ఫలహారాలు తీసుకుంటున్నాం. నే చెప్పబోయేది సావధానంగా వినండి. కంగారు పడకండి.

ఊర్వ: [కంగారుగా] ఏమిటండి?

మధు: చెప్పు బాబాయ్-నాకు భయమేస్తోంది!

రఘు: [చెయిపైకెత్తి] Please! [Dead silence] నేను చెప్ప బోయే వార్త—ఇక్కడ మన అయిదుగురి జీవితాలను దగ్ధ పటలం చేసేస్తుంది. సందేహం లేదు. మరి అలాంటప్పుడు ఆ వార్త మీకు చెప్పటమా, మానటమా అని నాలో నేను ఎంతో తర్జన భర్జన చేసుకున్నాను. కాని చివరికి చెప్పా లనే నిశ్చయించుకున్నాను. ఊర్వశీ! ముందుగా నిన్నొక సూటి ప్రశ్న అడుగుతాను....[ఠకీమని ఆపుతాడు. Dead Silence. మామూలుగా రామానుజంతో] ఎలావుందిరా Suspense!

రామా: అవును. ఏమిటి?

రఘు: ఏముంది? అంతే? Curtain! [అని నవ్వుతాడు. అంతా అమ్మయ్యా అని నిట్టూరుస్తారు. ఊర్వశీ కామరాజులతో] 'రెండో అంకం ఎలా ముగించాలి' అని యిందాక మాలో మాకు ఒక మీమాంస వచ్చిందిలెండి!

( Curtain falls )

# నాటకం

## మూడవ రంగం

[తెర లేస్తుంది. స్టేజీమీద నాలుగయిదు కుర్చీలు, ఒక table ప్రక్కన వుంటయ్. వెనక ఒక వుద్యానవన Curtain వుంటుంది.

ప్రవేశం శివశంకరం. సన్నగా పొడుగ్గా వుంటాడు. చెక్కు చెదరని సూటు, నున్నగా దువ్వినతల, ఒక monacle అతని వేషం. చేతిలో ఒక పండు, ఒక పుస్తకం, విసనకర్ర పట్టుకు వస్తాడు.]

శివ: [ప్రవేశించి వెనక్కి తిరిగి] పెరుమాళ్లు!.... పెరుమాళ్లు!

పెరు: [లోపల్నుంచి] Sir, Sir.

శివ: ఎక్కడ చచ్చావ్?

పెరు: [ప్రవేశం] వచ్చాను సార్ [చేతిలో ఒక పెద్దకత్తి, రెండు కవస్లు ఏవేవో వుంటాయ్]

శివ: యింత ఆలస్యమా?

పెరు: వస్తూ వస్తూ, మెట్లమీద కాలుజారి పడిపోయింది సార్.

శివ: అట్లా పడగూడదు!

పెరు: Yes Sir.

శివ: ఆలస్యంచేస్తే నాకు చెడ్డ కోపం!

పెరు: ఆమ సార్. మా మేనత్త ఒకామె వుండేది—

శివ: నీ కొక్కడికే కాదులేవోయ్, నాకూ వుంది మేనత్త!

పెరు: అది యిర్లే సార్.

శివ: Shut up!

పెరు: Yes Sir.

శివ: కావలసిన పరికరాలన్నీ వచ్చినట్లేనా?........

పెరు: చూడండి సార్! కత్తి, కవర్లు........

శివ: పుస్తకం, పండు, విసనకర్ర....ఆఁ,అన్నీ వున్నట్టే- యిశ్! అబ్బ! తలనొప్పి చంపేస్తున్నది.

పెరు: అమృతాంజనం వేస్కొండి సార్.

శివ! సువుగాని అమృతాంజనం ఏజెంటువా?

పెరు: లేదు సార్!

శివ: మరి?

పెరు: మీరు అనవసరంగా Worry అవుతారు సార్! అందుకే తలనొప్పి.

శివ: మరి నాటకా లాడించడమంటే—worry కాకపోతే ఎలా? ఎంత శ్రమ! ఎంత బాధ్యత! "యిల్లు కట్టిచూడు, పెళ్ళి చేసి చూడు" అన్నారు గాని మనవాళ్ళు—నన్నడిగితే నాటక మాడించి చూడమనేవాణ్ణి. అందులో మన యాక్టర్సు అనుకున్నప్రకారంProgramme జరపనేజరపరు. నిముష నిముషానికి మార్పే! యిప్పుడు చూడు. మొదట ఊర్వశి నృత్యనాటిక అని Announce చేశాం. యిప్పుడు 'కాదు. మామూలు నాటిక' అని మార్చారు. అసలు మన యాక్టర్సుకి....

కామ: [ప్రవేశం. రాజకుమారుడి వేషం వేసుకుని వుంటాడు. Portion చదువుకుంటూ వస్తాడు]

శివ: Good evening Sir.

కామ: Good evening.

శివ: మిగతావారు....

కామ: వస్తున్నారు. (Pause) Dress వేసుకుంటున్నారు—

శివ: మధ్యాన్నం ఇక్కడ మంచి Dinner జరిగిందటగదండీ! నేను రాలేకపోయానండి.

కామ: నేనూ వెళ్ళలేదండి.

శివ: ఏమండీ? యిక్కడే వున్నారుగా మీరు?

కామ: యీ రోజంతా నాకు వ్రాతతోనే సరిపోయింది.

శివ: మీరు వ్రాసేది ఏమిటో అడగవచ్చునా?

కామ: అడగ కూడదు.

శివ: కాదండి. రాస్తున్నానంటేను-కవిత్వమేమో ననుకున్నాను.

కామ: కవిత్వం గాదు, Portion!

శివ: పెరుమాళ్లు! యిక నువ్వు వెళ్లు! [పెరుమాళ్ళు exit ] Stage manager పనంత ఛండాలపుది మరొకటి లేదనుకోండి. ఊపిరాడదు. పోనీ యింత కష్టపడితే-actors ఆఖరికి Thanks కూడా చెప్పరు. 'అది సప్లయి కాలేదు. యిది సప్లయి కాలేదు' అని చివరికి చివాట్లు-[Puase] చాలా మౌనంగా వున్నారు?

కామ: డాక్టర్ల సలహా!-ఆరోగ్యం బాగుపడుతుంది. మీరు గూడ

Try చెయ్యండి.-ఆఁ-అన్నట్లు అసలుProgrammeఎన్ని గంటలకి మొదలు?

శివ: 6 గంటలకండి. మొదట ఏవో వుపన్యాసాలూ అవి వున్నయ్. అవి అయిన తరువాత మన నాటకం.

కామ: అయితే బాగా వ్యవధి వుందన్నమాట!

శివ: బోలెడు వ్యవధి వుందండి. అందుకే మంచి Grand set arrange చేస్తానన్నాను. కాని ఊర్వశిగారు అక్కర లేదు Plain set చాలునన్నారు.

కామ: ఏవో ఒకటి తెద్దురూ!

శివ: Dress కోసం city అంతా తిరిగానండి. ముఖ్యంగా Sarees latest verietiesతెచ్చాను. ఏమండీ-నాకో అనుమానం-Market లోకి కొత్తగా Suraiya sarees, Nargis sarees వచ్చాయిగ్గాని, అంజలీదేవి sarees వరలక్ష్మి sarees రాలేదేమండి?

కామ: ఆ విషయం ఆంధ్రరాష్ట్రి చేనేత సంఘంవాళ్ల నడగండి.

శివ: అడిగానండి. యింకో Suggestion గూడా యిచ్చాను. Sarees కి Hollywood Stars పేర్లు పెట్టమన్నాను. Greta Garbo,Bette Davis, Vivien Liegh.అంటే వాళ్ళన్నారు, 'వాళ్ళు ఆడవాళ్లా మొగవాళ్లా'అని అడిగారు. 'అచ్చమైన ఆడవాళ్లయ్యా, అందులో ఏమీసందేహంలేదు' న్నాను. అంటే వాళ్ళన్నారు.... [Sudden గా ఆగి] ఓ క్షమించండి. కొంచెం అతిగా మాట్లాడుతున్నట్టున్నాను.

కామ: మీ అంతట మీకే తెలిసిందా?

శివ: అది కావండి. పని ఎక్కువగా వున్నపుడు, కొంచెం అతిగా మాట్లాడబుద్ధవుతుందండి.

కామ: యిప్పుడు మీకేమిటి అంత తలకు మించిన పని?

శివ: అదేమిటండి, అలా అంటారు! రాత్రికి నాటకం ఆడించే దంతా నేనే కదండి. Stage Manager ని నేనే, Booking office లో నేనే, Prompting చేసేది నేనే, ఆడవాళ్ళకి Seats చూపించేది నేనే. ఆర్కెష్ట్రాకి Instructions యిచ్చేది నేనే, Scene అయిన తరువాత స్టేజిమీద సామాన్లు సర్దేది నేనే, ఆడియన్సులోకి వెళ్ళి అవసరమైనప్పుడు చప్పట్లు కొట్టించేది నేనే. ఓ! నాటకం నాటిరాత్రి నాకు కంటిమీద రెప్పవాలదనుకోండి.

కామ : [కామరాజు పరధ్యానంగా వుంటాడు]

శివ : మీ రెందుకో యివాళ అఘోరకంగా వున్నారండి !

కామ : రోజంతా యీ పాడు Portion చదివితే, నీకైనా అలాగే వుంటుంది.

శివ : క్షమించండి. యిందాక రోజంతా రాస్తూనే వున్నానన్నారు.

కామ : నాకు రాస్తేనేగాని Portion రాని జబ్బొకటుంది.

శివ : ఓ, నిజంగా మీకు ఎంత ఓపికండి !—యిందులో మీ వేషం మంచిదేనాండి ?

కామ : ఛీ! ఛీ! ఛండాలపు వేషం !

శివ : ఏమండోయ్. మీ రేమీ అధైర్యపడకండి. నా చేతిలో

దజనుమంది కత్తుల్లాంటి కుర్రాళ్లున్నారు. ఆడియన్సులో నుంచి ఎప్పుడు కావాలంటే అప్పుడు చప్పట్లు కొట్టిస్తాను. మీ రెంత ఛండాలంగా act చేసినాసరే........

కామ : [కోపంగా] Thank you.

శివ : అహహ ! నా వుద్దేశం........ [పూర్వశి ప్రవేశం] హల్లో ! good evening, good evening !

ఊర్వ : Good evening [వెనుకనే మధు ప్రవేశం]—ఎందుకు ఆలస్యం,—begin చెయ్యగూడదూ ?

కామ : రఘుపతిగారు వచ్చిందాక ఆగితే మంచిదేమో :

ఊర్వ : ఆయన కాసేపట్లో వచ్చేస్తారులెండి!....మరి Prompter ఎవరు ?

శివ : Present sir ! Present Madam !

ఊర్వ : ఇదిగో script [అని యిస్తుంది]

శివ ; [తీసుకుని] set మీద furniture చూడండి. arrangment బాగుందా?

ఊర్వ : ఓ. చాలాబాగుంది.—ఏం మధూ! యివాళంతా అలా వున్నావ్ ?

మధు : అబ్బే మరేం లేదు. రాత్రంతా నిద్రలేదు గదూ—కొంచెం బడలికగా వుంది. మీరు కానివ్వండి.

ఊర్వ : మరి నువ్విక్కడెందుకూ ? వెళ్ళి కాస్త rest తీసుకో రాదూ ?

మధు : అఁ. ఫరవాలేదు.

ఊర్వ : అదికాదు నే ననేది. ఒక్కసారే నాటకం చూడొచ్చుగా రాత్రికి యిప్పుడు rehearsal చూస్తే తరువాత నాటకం చూడబుద్ధికాదు. అందులో నాటకంగూడ ఆటే మంచిది కాదు.

మధు : అదిగూడ కాదు. తను వచ్చేదాకా బాబాయ్ నన్నిక్కడుండి మీ కేదయినా సహాయం చేయమన్నాడు. అందు కని........

ఊర్వ : సరే, నీ యిష్టం! ఏమండీ! యిక begin చెయ్యొచ్చా? సామాగ్రి అంతా వచ్చినట్టేనా ?

శివ : ఏమండోయ్ శివశంకరం arrangment అంటే - ఒక పూచికపుల్ల గూడ పొరపాటు రాకూడదు! చూడండి. అన్నీ యిక్కడే పెట్టేశాను.

ఊర్వ : [పుస్తకం, వుత్తరం తీసుకొని] అవి మీరు తీసుకోండి. [కామరాజు వుత్తరం, పండు తీసుకుంటాడు] ఆc. begin చెయ్యండి. మేనక - అంటే నేను - ఒంటరిగా తోటలో కూర్చుని, చదువుకుంటూంటుంది. [కూర్చుని కామరాజుతో] మీ రప్పుడే రాకూడదు [అతను పక్కకి వెడతాడు]

శివ: [చదువుతూ] తెర లేచేసరికి రాజపుత్ర స్థానంలోని ఒక రాజప్రాసాదంలో వుద్యానవనం. సమయం సాయం కాలం.

ఊర్వ : అదంతా ఎందుకండీ ?

శివ : యిందులో వుందండి.

ఊర్వ : మా పోర్షన్లుమటుకి చెప్పండి, చాలు !

శివ : Back ground ఏమిటో తెలీకపోతే....

ఊర్వ : యిశ్శ్ అబ్బ! [విసుగుతో] మీకు ప్రాంటింగే చేతకా దేమండి.

మధు : మీరుండండి. ఇటివ్వండి నే చేస్తాను. [అని Script లాక్కుంటాడు]

ఊర్వ : కామ: [ఒకేసారి] అహహ- మీరొద్దు ! మీరొద్దు !

మధు : ఏం, ఎందుకని ?

శివ : ఇది మర్యాదస్తులు చేయవలసినపనిగాదని వారి వుద్దేశం. నాకివ్వండి [అనిలాక్కోబోతాడు]

మధు : వుండండి. ఆటే గోలచెయ్యక [యివ్వడు]

శివ : [కోపంతో] ఏమండోయ్! యిది నాకు చాలా Insult; అవమానం !

మధు : పోనీ, రాత్రికి అసలు నాటకానికి మీరే చేద్దురుగాని, సరేనా ?

శివ : నాజీవితంలో యిప్పటికి కనీసం 90 నాటకాలకి Prompting చేశానండి, మీ రివాళ వూరికే అనేశారు నాకేమీ చాతకాదని.

ఊర్వ: పాపం ఆయనకి అనవసరంగా కోపం తెప్పించావు మధూ !

శివ : నాకేం కోపమండి— ప్రొద్దునలేస్తే చివాట్లతో కడుపు నింపుకునేవాడికి.

ఊర్వ : ఊఁ. కానివ్వండి. [కామరాజుతో] మీ రలా వెళ్లండి. [కా.వెళతాడు] మేనక ఒంటరిగా చదువుకుంటూ వుంటుంది. [పుస్తకంతీసి చదువుతూంటుంది]

మధు : [Prompting] ఒఠ్ఠిచెత్త !

ఊర్వ : ఒఠ్ఠి చెత్త ! [పుస్తకంమూసి] యీరోజుల్లో వచ్చే నవలలన్నీ యింతే !

మధు : [Prompting] ఏమీ తోచడంలేదు.

ఊర్వ : [అవులించి] ఏమీ తోచడంలేదు. క్షణం ఒకయుగంగా వుంది. రాజకుమారుడి కెప్పుడూ వేట, వినోదాలు ! పోనీ నన్ను కొన్నాళ్లు పుట్టింటికైనా పంపరు.

మధు : దూరంగా గుర్రపుడెక్కల చప్పుడు !

[శివశంకరం రెండు కొబ్బరి చిప్పలు తీసుకుని బల్ల మీద కొడుతుంటాడు-డెక్కలచప్పుడులాగా]

ఊర్వ : అదుగో! గుర్రపుడెక్కలచప్పుడు. రాజకుమారుడైయుండవచ్చునా ? అవును. రాజకుమారుడే !

[శివశంకరం డెక్కలచప్పుడు పెద్దది చేస్తాడు. ప్రవేశం కామరాజు. రాకుమారునివేషం. ధీమాగా, ఠీవిగా ప్రవేశిస్తాడు. యింకా శివశంకరం డెక్కలచప్పుడు చేస్తూనే యుంటాడు. కామరాజు విసుగ్గా శివశంకరంకేసి చూసి 'యిశ్శ్' అంటాడు. అతను అప్పుడు ఆపుతాడు]

కామ : ఏం మేనకా ?

ఊర్వ : ఏమండీ. ఎందుకలా కోపంగా చూస్తారు నా వంక?

కామ : ఎందుకా? త్వరలోనే తెలుస్తుంది. నీవు మాట్లాడేది ఎవరితోనో తెలుసా ? —ఉదయపూర్ మహారాణావారి అనుంగు సోదరుడు శ్రీ మహా....

మధు : [Prompting] శ్రీ మహావీర విజయ గోపాల నృసింహ

కామ : శ్రీ మహావీర విజయ గోపాల నృసింహ భూపతితోసుమా!

ఊర్వ : అమ్మో ! నాకేదో భయం వేస్తోంది.

కామ : అవును. నీవు అపరాధివని నీ అంతరాత్మే హెచ్చరిస్తోంది.

మధు : [Prompting ] విశ్వాసఘాతకీ ! [పూర్వశి వులిక్కిపడి మధుకేసి భయంతో చూస్తుంది. మధులేచి] విశ్వాస ఘాతకీ! నాకేవో కట్టుకధలు చెప్పి, మభ్యపెట్టి మోసం చేద్దామనుకున్నావా ?

[రఘు, రామానుజం వస్తారు. ఊర్వశి కామరాజు కంగారు పడతారు - మధు వాళ్లనే వుద్దేశించి అంటున్నాడేమోనని. ]

కామ: [కంగారుతో] నాకేవో కట్టు....కధ....లు.

మధు: [అదే ధోరణిలో వుద్రేకంతో] ఆ మాత్రం జ్ఞానంలేని పశువు ననుకున్నావా? నువ్వు ఏంచెప్పినా—వూరికే నమ్మే సేటంత శుంఠ ననుకున్నావా?

రఘు: [మధు ఏదో గొడవచేస్తున్నాడని భయపడి] ఏమిటా్రి మధు!!!

మధు: యిళ్ళ్!! [అదే ధోరణిలో] నా కేవో కట్టుకథలు చెప్పి....

రఘు: [అర్ధం చేసుకుని] అమ్మయ్యా! .... [Script మధునుంచి తీసుకుంటూ] అలా కాదురా. అది యిటివ్వు చెబుతాను.

మధు: ఏం నా, Prompting బాగుండలేదా?

ఊర్వ: [బుజ్జగిస్తూ] Prompting చేసేవాళ్ళు అలా వుద్రేక పడకూడదు మధూ!

మధు: అది చదివితే ఎవడికైనా వస్తుంది వుద్రేకం!

శివ: యింత కొమ్ములు తిరిగిన Prompterని నేనే పనికిరాలేదే వాళ్ళకి-యిక మీరా?

మధు: మరి ఎలా చెయ్యాలంటారు?

రఘు: వూరుకోండిరా! నే చేస్తాగా!-ఆఁ, ఎంతవరకు వచ్చారూ?

కామ: విశ్వాసఘాతకీ! నన్నింత మోసంచేస్తావా? నా కెన్నాళ్ళ నుంచో వుంది అనుమానం. కాని యీ నాటికి దొరకినై ఆధారాలు. నాకేవో కట్టుకథలుచెప్పి, మభ్యపెట్టి మోసం చేద్దామనుకున్నావా? ఆ మాత్రం జ్ఞానంలేని పశువునను కున్నావా? నువ్వు ఏం చెప్పినా వూరికే నమ్మేసేటంత శుంఠ ననుకున్నావా? పొరపాటు మేనకా! నే నంతా కని పెట్టాను. చిన్ననాటి స్నేహితుడనే నెపంతో, నీ మేనత్త కొడుకుతో నీవు సాగించే తతంగం అంతా కనిపెట్టాను.

ఊర్వ: అంతా అబద్ధం!

కామ: నోరు ముయ్! నిదర్శనాలన్నీ యిప్పుడు నా జేబులో వున్నాయ్! విశ్వాసఘాతకీ! నీకు విశ్వాసంలేదు. నేను నిన్ను

వివాహమాడకముందు నీ స్థితి ఏమిటి? ఒక నీచ కుల స్త్రీరాలివి. నీ తండ్రి మా తండ్రి ఆస్థానంలో ఒక సామాన్య నౌకరు. నువ్వూ నీతల్లి ఆ పాడు గుడిసెల్లో పడి కుళ్లుతున్నారు. అప్పుడు నాకంట బడ్డావు. నీ మీద దయ తలచి నిన్ను నా మందిరానికి రప్పించి ఆదరించి నీకింత గౌరవ ప్రతిష్టలు సంపాయించి పెట్టాను. తరువాత మా రాజవంశ సాంప్రదాయాలన్నీ అతిక్రమించి నా పట్టమహిషి అభీష్టాన్ని సరకుచేయకుండా నిన్ను పెళ్ళి చేసుకున్నాను. అంతేకాదు. నీకు సకల ధన కనక వస్తువాహనాలన్నీ సమకూర్చాను. నా మేనమామ రాజేంద్రమహీంద్ర చంద్ర నృసింహనృపాలుడు నాకు ముద్దుగా బహూకరించిన యీదివ్యభవ్యహర్మ్యరాజాన్ని నీకుప్రణయ కాన్కగా సమర్పించాను. [అని అలసిపోయి వూరుకుంటాడు]

రఘు: ఏం ఆపారేం?

కామ: [ఇవతలకు వచ్చి]గుండెలు పగిలిపోతున్నాయండీ! ఏం Dialogues అండీ?

రఘు: మన మేం చేస్తాం?

కామ: కాస్త Cut చేయగూడదూ?

రఘు: ఆ యింకానయం? Cut చేస్తారుగా!

కామ: యీ Dialogues యిలా చివరిదాకా అరచానంటే నే నమాంతం చచ్చి వూరుకుంటాను. పేజీపేజీన్నర

Dialogues-అందులో యింతటి పొడుగు పేర్లు-ఆ పేర్లన్నీ Cutచెయ్యండి.

రఘు : ఒక అక్షరంమార్చినా రసభంగం అవుతుంది. ఆ పాత్ర చేత అదంతా చెప్పించడంలో అర్థంలేకపోలేదు. ఆమె కోసం అతను ఎంత త్యాగంచేశాడో ప్రేక్షకులకు పూర్తిగా తెలియాలి. అప్పుడు "చూచావా, యింతచేసినా, దానిబుద్ధి మానిందేమో" అని ఆవిడమీద ప్రేక్షకులకి అసహ్యం కలగాలి. పాత్రపోషణ విషయంలో డి. యల్. రాయ్‌కి టంకి మనం పాఠాలు చెప్పేదీ?....కానియ్యండి. కానియ్యండి.

కామ : [నిట్టూర్చి] నిన్నొక యిల్లాలునిచేసి, సకలభోగభాగ్యాలు సమకూర్చాను. కాని ఫలితం ? నాకే ద్రోహం తలపెట్టావు. చివరికి ఒక క్షుద్రుణ్ణి- నీ మేనత్తకుమారుడిని ప్రేమించావు. రత్నాన్ని వదలి రాళ్లకోసం ఆశపడ్డావు. నాకు వాడికి పోలికేమిటి ? నేను రాచబిడ్డను. వాడో- చిత్తూరు మహారాణా శ్రీ మహేంద్ర విజయ వీరసంగ్రామ సింహ రాణావారి ఆస్థానంలో సామాన్య చిత్రకారుడు ....కులహీనుడు, నీచుడు, సేవకుడు, బానిస——అబ్బ ! గుండెలు పగిలిపోతున్నాయ్.

రఘు : ఆ చివరివాక్యం యిందులో లేదండీ !

కామ . ఏం చావమంటారండి ? యివెక్కడి Dialoguesఅండి ?

రఘు : నేనుమటుకు ఏంచేయను- ఆ కవి అలా రాశాడు.

ఊర్వ : [భయంతో] కానివ్వండి త్వరగా !—ఆఁ. యీ అవమా నాన్ని భరించలేను. మీ అర్ధాంగిని మీరే శంకిస్తున్నారు-

కామ : నోరుముయ్‌! నీ నేరాన్ని నిదర్శనాలతోసహా నిరూపిస్తాను.

ఊర్వ : నిదర్శనాలు, నిరూపణ. హహ్హహ్హా....[అని నవ్వుతుంది]

కామ : సిగ్గులేక నవ్వుతున్నావా ? యిదిగో చూడు- [అని పండు తీస్తాడు]

ఊర్వ : [భయం నటిస్తూ] ఓ ! గజనిమ్మపండు !

కామ : అవును. గజనిమ్మపండు ! దేశదేశాలనుంచి మొక్కలు తెచ్చి నా సుందర నందనోద్యానంలో నాటి, ప్రాణంతో సమానంగా పెంచి, అవి దినదినాభివృద్ధి పొందుతూవుంటే ఆనందంతో పరవశంచెంది, నా సర్వస్వంగా పూజిస్తున్న నా తోటలో పండిన ప్రథమఫలం ! [అలసిపోయి రఘుపతి వేపు చురచుర చూస్తాడు] నా కీ పండ్లతోటలంటే ఎంత ప్రాణమో నీకు తెలుసు ! వీటిని ఎంతెంత దూరదేశాల నుంచి తెప్పించానో, వాటికోసం అహోరాత్రాలు ఎలా కృషిచేశానో, వాటిని ఎంత ప్రాణప్రదంగా పోషించానో, ఆ పండ్లకోసం ఎంతకుతూహలంతో వేచియున్నానో నీకు తెలుసు. కాని చివరికి ఏం జరిగింది ? యీ రోజు వాహ్యాళికని నదీ తీరాన అశ్వారూఢుణ్ణయి వెళుతున్నాను. [శివశంకరం మళ్లీ డెక్కల చప్పుడు చేస్తాడు. కామరాజు కోపంగా చూసేసరికి తెల్లమొఖంవేసి ఆపుతాడు]

రఘు : [Prompting] అప్పుడెవరు కనబడ్డారు ?

కామ : అప్పుడెవరు కనబడ్డారు ? నీ దాసీ మాలతి ! — 'ఇక్కడున్నావేం' అని పలకరించాను. మాలతి భయంతో గజగజ వణికిపోయింది. నాకు అనుమానం వేసింది. ఎక్కడికి వెడుతున్నావని గద్దించాను. అప్పుడు చెప్పింది మాలతి "మా అమ్మగారు చిత్తూరు మహారాణా శ్రీ మహేంద్రవిజయ వీర సంగ్రామసింహ రాణావారి ఆస్థాన చిత్రకారుడు చిత్రవర్మదగ్గరకు వెళ్లిరమ్మన్నారు" అని. అబ్బ ! నా కడుపు మండిపోయింది.

రఘు: ఆఁ, యీసారి ఆ వాక్యం యిందులోవుంది.

కామ: 'అతనితో మీ అమ్మగారి కేంపని' అన్నాను. మాలతి ఏమీ చెప్పలేక తడబడింది. తన చేతులోది ఏదో దాచబోయింది. నేను బలవంతంగా చేతులోది లాక్కుని చూచాను. ఏముంది? యీ పండు! గజనిమ్మపండు! నా కన్నబిడ్డకన్న మిన్నగా నాప్రాణం పోసి పెంచుకొన్న నా మాణిక్యం. అంతేకాదు దానితోపాటు ఒక ఉత్తరం! ఇదుగో! (అని జేబులోనుంచి పొరపాటున సిగరెట్‌పెట్టె తీస్తాడు. మళ్ళీ అది లోపల పెట్టి ఒక ఉత్తరం తీస్తాడు. చదువుతూ) "ప్రియా! ఇది నా ప్రియునితోటలో కాసిన మొదటి పండు. ఇందులో నా అధరామృతం పొదవి పంపిస్తున్నాను. ఆరగించి ఆనందించు!" [చూడు అని ముక్కుదగ్గర పెడతాడు.]

ఊర్వ: వాసన చూడమనా మీ వుద్దేశం?

కామ: వ్రాత నీది కాదని బుకాయించినా, నీకు నేను బహూకరించిన

ఆ గులాబి అత్తరు పరిమళాన్ని కాదనగలవా?

ఊర్వ: అనను.

కామ : అయితే నువు చేసినపని ఒప్పుకుంటున్నావన్నమాట!

ఊర్వ: అవును.

కామ : యీ పండుకూడా పంపింది నీవే?

ఊర్వ: అవును.

కామ : [విసుగ్గా యివతలకొచ్చి రఘుపతితో] చాలా అన్యాయమండి? నేనేమో యింతింత పొడుగు dialogoues గొంతు పగిలేటట్టు అరవడం, ఆమేమో 'అహఁ, ఉహుఁ, అవును, కాదు,' అని ఒక్కమాటలో తేల్చెయ్యడం! ఏమిటండి ఇది?

రఘు : D. L. Roy. నాటకాల్లో ఆడవాళ్ల సంభాషణలన్నీ అలాగే వుంటాయ్. అదే అతని ప్రత్యేకత.

కామ : [నిట్టూర్చి, మళ్ళీ వెనక్కువెళ్ళి] అయితే, నాదగ్గర సకల సౌఖ్యాలూ, భోగభాగ్యలూ అనుభవిస్తూ, నాకు ప్రియమైన వస్తువుల్ని చాటుగా నీ ప్రియుడుకి పంపిస్తున్నావన్నమాట!

ఊర్వ : కాదు!

కామ : ఏమిటికాదు? అతడు నీ ప్రియుడు కాదంటావా?

ఊర్వ : అవును

కామ : నీ ప్రియుడు కాదనా?

ఊర్వ : అవును

కామ : ఏమిటి అవును! కాదు! అవును. పిచ్చివేషాలు మాని, సరిగా చెప్పు!

ఊర్వ : అయితే నా ప్రవర్తన నీచమయిందనేనా మీ అభిప్రాయం

కామ : నీచంకాదు నీచాతి నీచం!

ఊర్వ : సరే! అయితే నేనోక ప్రశ్న అడుగుతాను చెప్పండి. రెండు నెలల క్రితం, నేను దేవిపూజకోసం ప్రత్యేకంగా వుంచిన మామిడిపండ్లు నాకు తెలియకుండా ఎవరికి పంపించారు?

కామ : అవా ? అవి-అవి....[తడబడుతూ] అవి మా మేనత్తకు పంపించాను.

ఊర్వ : మీ మేనత్తకు పంపించారా ? అయితే, యిదిచూడండి ! మీ రొక్కరేగాదు వుత్తరాలు పట్టుకుంది. [అనిఉత్తరం తీసి] వాసన చూడండి. గుర్తుకొచ్చిందా ?

శివ : Oh-what a situation! మొత్తంమీద D. L. Roy. అనిపించాడండీ ! ఒహ్! .... [రఘు, శివశంకరాన్ని మెల్లగా చేతికర్రతోపొడిచి, ఆపుతాడు]

ఊర్వ : మీరు కాశ్మీరంనుంచి ప్రత్యేకంగా తెప్పించిన చందినీ అత్తరుకదూ ?

కామ . యీ వుత్తరం నీకెలా వచ్చింది ?

ఊర్వ : ఉత్తరాలు బాణాల్లాంటివి. వదలటమే మనవంతు వాలటం మనచేతిలో వుంటుందా ?

శివ : [చప్పట్లు కొడుతూ] గొప్ప అలంకారం ! ఉపమ-కాదు-ఉత్ప్రేక్ష ! [రఘు మళ్లీ వారిస్తాడు]

ఊర్వ : అనిపదవండి కొంచెం !

కామ : [చదువుతాడు] ప్రియా ! ఒక మూర్ఖుడు నాకు పంపిన ప్రేమకానుకయిది. [ఆశ్చర్యం]

ఊర్వ : మీరు పంపిన ప్రేమకానుక మీ ప్రేయసి మరో ప్రియుడుకి పంపుతోంది. మీ ప్రేయసికి ఎంత అనురాగమో మీ మీద.

కామ : [చదువును] ఒక మూర్ఖుడు నాకు పంపిన ప్రేమకానుకయిది. యివి అతని తోటలో కాసిన తొలిమామిడిపండ్లుట. యీ వుత్తరానికి రాసిన అత్తరుగూడ బహూకరణె ! మూర్ఖుడె అతనే పంపితే, మనమెందుకు నిరాకరించాలి? అనుభవించి, ఆనందిద్దాం. ఇక్కడికిరా ! యింకా యింకా అందిస్తా ! [సిగ్గుతో తలవంచి, దుఃఖిస్తాడు]

ఊర్వ : యిప్పుడర్థమయిందా ? నేను మీకు చేసింది, మీరు నాకు చేసింది దెబ్బకు దెబ్బ ! ప్రతీకారం !

కామ : [దుఃఖంతో] అవును. అర్థమయింది.

ఊర్వ : సరే ! యిక వెళ్లండి. నేను ఈరోజే నాపుట్టింటికి వెళుతున్నాను. మీరు నిజం తెలుసుకోవాలంటే నాదాసి, మాలతి నడగండి. మీకు కనబడేటట్టు నదీతీరానవుండి, మీరు ప్రశ్నించగానే, భయం నటించి, తడబడి, చివరకు మీకీ వుత్తరమియ్యమని చెప్పి పంపించాను. అంతేగాని, నాకెవ్వరూ ప్రియులులేరు, నేను ఎవ్వరికీ ప్రేమకానుకలు పంపనూలేదు. [అని పోబోతుంది]

కామ : అయితే వెళ్లిపోతున్నావా ?

ఊర్వ : అవును వెళుతున్నాను. మళ్లీ ఎన్నటికీ తిరిగిరాను.

కామ : [అడ్డంవెళ్లి] వద్దు వెళ్లవద్దు. నిన్ను క్షమాభిక్ష వేడు కుంటున్నాను. [అని మోకాళ్లమీద పడతాడు] యీ ఒక్క అపరాధం క్షమించు.

ఊర్వ : రాచబిడ్డలు అలా అభిమానంవదలి ప్రాధేయపడతారేం ? —అయినా ఆడదానిది సహజంగా జాలిగుండె గాబట్టి క్షమిస్తున్నాను.

కామ : అమ్మయ్య [అని లేస్తాడు]

ఊర్వ : కాని, మీకు కొంతశిక్ష తప్పదు. మీరు ఏడాదివరకూ మనతోటపండ్లు ఏవీ ముట్టుకోగూడదు.

కామ . అమ్మో ! అవినాప్రాణం ! మరేదైనా శిక్ష....

ఊర్వ : కాదు. అదేశిక్ష : యిది నా ఆజ్ఞ.

కామ : సరే ! అలాగే !

ఊర్వ : రెండవది. నన్ను నాయిష్టంవచ్చినపుడు నాపుట్టింటికి పంపాలి.

కామ : అలాగే !

ఊర్వ : రేపు ఉదయమే ప్రయాణానికి అన్నీసిద్ధం చేయించండి.

కామ : రేపే వెడతావా ? మళ్లీతిరిగి ఎప్పుడు వస్తావ్ ?

ఊర్వ: నెలరోజులు !

కామ : నెలరోజులా! దుర్భరం! ప్రేయసీ, నీవే నా హృదయాధి దేవతవు ! నా ప్రణయ సామ్రాజ్యానికి పట్టమహిషివి.

ఊర : [విసుగ్గా] అబ్బా ! మళ్లీ మొదలా ?

కామ : అవును ప్రేయసీ ! మకరంద మాధుర్యాన్ని మధుపం మరచిపోగలదా ? నిన్ను నా జన్మలో మరవలేను. నీవు లేందే నేను ఒక్క క్షణంకూడా బ్రతకలేను.

ఊర్వ : ఊఁ- అంతా బూటకం !

[మకరందం, మధుపం, అనే మాటలు వినగానే మధు, రామూ-ఒకరి మొఖాలు ఒకరు చూచుకుంటారు]

రామూ : ఉండండి ఉండండి. ఆ Dialogue మళ్ళీ ఒకసారి చెప్పండి.

ఊర్వ : ఏదీ? ఎందుకు?

రఘు : యిక్ష్! ఏమిట్రా మధ్యలో మీ గొడవ. వాళ్ల moods అన్నీ అలా చెడగొడితే! ఎలా!

శివ : ఏమండి నాకు చాలా కుతూహలంగావుంది-చివరికి ఆవిడ వెళ్ళి పోతుందా?- లేక యితనితోనే వుండిపోంతుందా?

రామూ: [మధు పక్కకువెళ్ళి కూర్చుంటాడు] అంతా విచిత్రంగా వుందిరా?

రఘు : యిక్ష్! నిశబ్దం: ఆఁ, మీరు కానివ్వండి. మళ్ళీ వెనక నుండి "నిన్ను నా జన్మలో మరువలేను"

కామ : నిన్ను నా జన్మలో మరువలేను నీవులేందే నేనొక్క క్షణంబ్రతకలేను.

ఊర్వ : ఊఁ! అంతా బూటకం?

కామ : బూటకం కాదు ప్రేయసీ! యిది నా హృదయం పలికే

పరమ సత్యం నీకోసం నేను ప్రణయోన్మత్తుణ్ణయి పోతు న్నాను. కాని నీవో రసంపిండి పారేసిన పిప్పిలాగ గెంటే స్తున్నావు.
[మధు, రామా, ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటారు. రామా ఆందోళనగా లేచి]

రామా: అరే రఘుపతీ!

రఘు : ఏమిటి?

రామా: [ఊర్వశీ, కొమరరాజులతో] క్షమించండి. మా వాడితో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి [అని రఘుని ముందుకు తీసు కుపోయి] వాళ్ల సంభాషణ విన్నావుట్రా?

రఘు : ఎందుకు వినలా? నాకేం చెవుడా?

రామా: అది కాదురా! ఆమాటలు యిదివరకెక్కడో విన్నట్టులేవూ?

రఘు : [ఆలోచించినట్టు నటించి] ఆవును సుమా! నువ్వు యిప్పు డంటే జ్ఞాపకం వస్తోంది ఏక్కడో విన్నట్టేవుంది సుమా!

రామా: [మధుతో] యిలారా! వినండి! యిందులో ప్రతి అక్షరం రాత్రి మనం ప్రక్కగదిలోనుంచి విన్నవే!

రఘు : [ఆశ్చర్యంలో Script చూచి] నిజమేసుమా! అంతాఅవే!

రామా: నువ్వెళ్ళి Rehearsal కానియ్ మళ్లీ వాళ్ళు చూస్తే అనుమానిస్తారు, మిగతాది కూడా విందాం. [రామా, మధు చెయిపట్టుకుని వెళ్ళి ఒకచోట కూర్చుని జాగ్రత్తగా వింటుంటారు]

రఘు : ఆఁ, ఆఁ, కానివ్వండి! "రసంపిండిపారేసిన పిప్పిలాగ గెంటేస్తున్నావ్!"

కామ : నన్ను రసంపిండిపారేసిన పిప్పిలాగ గెంటేస్తున్నావ్!

ఊర్వ: ఆఁ- ఆఁ- ఏంతమాట!....యిలారండి....ఏది....చంద్రబింబం లాంటి మీ ముఖారవిందం.

రమా : [మెల్లగా రఘుతో] విన్నావురా! ప్రతి అక్షరం రాత్రి మనం విన్నదే. యిప్పుడయినా తెలిసిందా రాత్రి వాళ్ళు చేస్తున్నదేమిటో? Rehersal!

రఘు : నిజమే సుమా! నాకేదో ఆందోళనగా వుంది.

మధు : జాగ్రత్తబాబాయ్! బయటపడగూడదు. నిగ్రహం:నిగ్రహం

ఊర్వ : ఏమిటండీ అది!

కామ : రిహర్సల్లో చర్చలేమిటండి.

రఘు : అహఁ. ఏమీలేదు. మా రామానుజానికి ఒక అనుమానం వచ్చింది. అది నాకూ సబబుగానే తోచిందనుకోండి....

ఊర్వ : ఏమిటది?

రఘు : చంద్రబింబంలాటి మీ ముఖారవిందం అన్నారు గదా-మరి అయన ముఖం........

కామ : ఏం నాముఖానికేం? అందంగాలేదూ?

రఘు : అందంగాదు పశ్న! మీ ముఖం కోలగా వుందిగదా....

కామ : ఏం చేస్తాం, వున్న మొఖం అది.

శివ : ఏమండోయ్! మీరేం భయబపడొద్దు మన దగ్గర ఫస్టుక్లాసయిన Makeupman వున్నాడు. మీ మొఖం ఎంత చం

దాలంగా వున్నా సరే.... వాడు....

కామ : [కోపంగా] Thank you!

మధు : అనవసరంగా Time waste చేస్తున్నాం....కానివ్వండి.

రఘు : ఆఁ. ఆఁ. Time ఎంతో లేదిక.

మధు : ఇక ఎవరూ మాట్లాడకండి.

ఊర్వ : ఆఁ. ఎంతవరకు వచ్చామండి?—ఆఁ, ఆఁ, ఏదీ, చంద్రబింబంలాంటి ముఖారవిందం.

కామ : నన్ను ఎలాగో మభ్యపెట్టి మరపించాలని చూస్తున్నావా? అన్యాయంగా రసం పిండి పారేసిన పిప్పికన్నా హీనంగా చూస్తున్నావు నన్ను.

ఊర్వ : అబ్బ! లెండి! ఎందుకండి అంత దీనంగా ప్రాధేయపడతారు? మీకు తెలీదూ మీరంటే నాకెంత యిష్టమో!

కామ : ఆ శరత్కాలపు చల్లని వెన్నెల్లో, ఆ పారిజాతాల తియ్యని పరిమళంలో ఎన్ని సుందర స్వప్నాలు, ఎన్నెన్ని మరపు రాని అనుభవాలు!....అన్నీ మరచిపోయావా ప్రేయసీ! అదుగో [అని బల్లమీద పెట్టివున్న గజనిమ్మపండుకేసి చూచి వుద్రేకపడుతూ చేయి వేయబోతాడు]

ఊర్వ : ఆఁ. వుండడి. ఏమి టా వుద్రేకం?

కామ : ఆ చక్కని ఆకారం చూస్తే ఎవరికి కలుగదు వుద్రేకం. ఆమేలిమి బంగారువన్నె....[అని యింకాదగ్గరకుపోతాడు]

ఊర్వ : ఆఁ-దూరంగా! [అని వారిస్తుంది]

కామ : [అమాంతం పండు చేతపట్టుకొని] అబ్బ! గుండ్రగా,

నున్నగా, మెత్తగా—ఓ! ఏం పరిమళం!

ఊర్వ : అహ్హాఁ-[అని లాక్కుంటుంది]

[రామానుజం, మధు కొంతసేపటినుంచి నవ్వుబిగబట్టి ఆపుకుంటారు. యిప్పుడు రామానుజం ఆపుకోలేక ఫక్కున నవ్వుతాడు. మధు చేతులు బారగాచాచి పకపకానవ్వుతాడు. పైగా రామానుజం వీపుమీద చరిచి యింకా నవ్వుతాడు యిద్దరూ గుక్కతిరగకుండా నవ్వుతూంటారు. కామరాజు కొంచెం కోపంతో కూడిన అవమానంతో తల పక్కకు తిప్పుతాడు. ఊర్వశి సిగ్గుతో మరోవైపు తిరుగుతుంది.]

రామా : [నవ్వుతూనే] ఎంత Fools రా మనం!

మధు : నెమ్మదిగా అంటావేం [అని నవ్వుతుంటారు]

కామ : [అమాయకంగా] ఏమిటండీ ఆ Joke! నాక్కూడా చెప్పరూ!

మధు : నీ కర్థం కాదులేవయ్యా!

ఊర్వ : [ఎరగనట్టు] ఎందుకండీ అలా విరగబడి నవ్వుతారు?

రఘు : [తొందరపడుతూ] ఊఁ. రిహార్సలు ఏమైనా వేసేది వుందా, లేదా?

మధు : యిశ్శ్!

కామ : అబ్బ! గుండ్రగా, నున్నగా, మెత్తగా....

రామా :
మధు : } [రామానుజం, మధు ఆపుకోలేక మళ్లీ పగలబడి నవ్వుతారు. యీసారి శివశంకరం అర్థంకాకపోయినా, వాళ్లతోపాటు నవ్వుతాడు]

కామ : ఏదీ, అలసి సొలసిన నా నేత్రాలపై మరపురాని ఒక్క చుంబనం !

ఊర్వ : అమ్మో ! కొరివిదయ్యాల్లాగా మీ కళ్లు చూడండి. ఎంత ఎఱ్ఱబడ్డాయో ! వెళ్లి విశ్రాంతి తీసుకోండి.

రామా : అబ్బే ! ఆ కళ్ల వర్ణన చాలా నీచంగా వుందిరా !

రఘు : అసలు వాడిపాత్రే నీచపాత్ర.

రామా : నీచపాత్రేమిటిరా ? రాజకుమారుడయితే ?

రఘు : పుట్టింది రాచపుటకేనోయ్ ! కాని బుద్ధి గడ్డితిన్నది. అందుకే అలావర్ణించాడు కవి. హుఁ- పాత్రపోషణలో D. L. Royకిరా పాఠాలు చెబుతావ్ !— ఊఁ- ఊఁ- కానివ్వండి.

కామ : మరి, రేపు నీవు పూడు వెళ్లవుగదూ ?

ఊర్వ : వెళ్లనులెండి.

కామ : వెళితే ఒట్టు ! నువు వెళితే నేను పిచ్చికుక్కలాగా ఒంటిరిగా తిరగాలిసివస్తుంది. [రఘుతో] ఏమండి ! ఆ ఒక్క మాట తీసెయ్యండి.

రఘు : ఏఁ- ఎందుకని ?

కామ : తనను తాను ఎవడైనా 'పిచ్చికుక్క' అని వర్ణించుకుంటాడండి?

రఘు : యిప్పుడైగదయ్యా, అనుకున్నాము. ' పాత్రపోషణలో D. L. Roy అందెవేసినచెయ్యి అని. ఆ రాజకుమారుడికి జంతువులమీద ప్రీతిఎక్కువ గాబట్టి అలా వర్ణించాడు.

కామ : జంతువులమీద కావండి, పండ్లతోటలమీద అతనికి ప్రీతి!

రఘు : తోటలమీద వున్నవాడికి, జంతువులమీద వుండదా ఏమిటి? కానివ్వండి, కానివ్వండి.

ఊర్వ : ఆఁ—ఆఁ——ఒట్టు. వెళ్ళనుగా ! సరేగానీండి,— మీ ప్రేయసి తనప్రియుడికి వ్రాసిన వుత్తరంలో మిమ్మల్ని 'మూర్ఖుడు' అన్నదేం !

కామ : అవును. నేను నిజంగా మూర్ఖుణ్ణే ! క్షుద్రుణ్ణి ! నీచుణ్ణి ! పశువుని— [రఘుతో] అబ్బ ! ఘోరమండీ.

రఘు : యిక ప్రతిమాటా మారిస్తే- అసలు నాటకం దెబ్బతినదూ? వాడు నీచుడుగాబట్టి నీచుడని వర్ణించాడు.

రామా : అరే రఘుపతీ ! యీ పాత్రమీద కవి కేదో కసివున్నట్టుందిరా.

రఘు : ఉన్నట్టేవుంది చూడబోతే.

ఊర్వ : అయిపోవచ్చిందిగా. కానివ్వండి త్వరగా!....ఊఁ.... మిమ్మల్ని 'మూర్ఖుడు' అన్నదేం ?

కామ : అవును. నేను నిజంగా మూర్ఖుణ్ణే ! క్షుద్రుణ్ణి, నీచుణ్ణి ! పశువుని ! కాసిని మంచినీళ్లు తాగివస్తానండి [అనిపోబో తాడు. యింతలో ఎదురుగా బట్లర్ Drinks తెస్తాడు]

మధు : [రఘుతో·రహస్యంగా] బాబాయ్ మనం అనుమానించిన సంగతి ఊర్వశితో పొరపాటుకైనా అనవుగదూ!

రఘు : ఛ. ఛ. నే నెందుకంటారా?

మధు : ఆమె కీ విషయం తెలిసిందంటే, యిక నా మొఖం గూడ చూడదు.

రఘు : ఆఁ. ఆమె కెలా తెలుస్తుందిలే!

ఊర్వ : కాసేపు ఆపండి మీ మాటలు!

మధు : పొరపాటు! క్షమించండి.

ఊర్వ : చూశావా — [అని apologetic గా, వయ్యారంగా చూస్తుంది.]

రఘు : ఆఁ. కామరాజుగారూ! మీరు ఆ last dialogue యింకా emotional గా అనాలండి.

కామ : [బిగ్గరగా] అవును. నేను నిజంగా మూర్ఖుణ్ణే! క్షుద్రుణ్ణి! నీచుణ్ణి! పశువుని!

రఘు : ఇంకొంచెం బాధతో!

కామ : [కడుపుమండి బిగ్గరగా] అవును, నేను నిజంగా మూర్ఖుణ్ణే! నీచుణ్ణి! పశువుని!

రఘు : ఆఁ. That's right. Once more Please!

కామ : [యింకా కోపంతో] అవును నేను నిజంగా మూర్ఖుణ్ణే! క్షుద్రుణ్ణి! నీచుణ్ణి! పశువుని!

రఘు : Yes! Good_

ఊర్వ : కాదు. కాదు. మీరు నా నోముల పంట! నా బంగారుకొండ.

రఘు : Curtain.

రామా: అయిపోయిందా?

రఘు : ఆఁ. అయిపోయింది.

[కామరాజు నిట్టూర్చి, కుర్చీలో కూలబడి మంచినీళ్లు తాగుతుంటాడు.]

కామా: కాని ఏమాత్రం సానుభూతిలేని పాత్ర. అయినా, ఆయన చాలా బాగా act చేసారు.

రఘు : ఆయన కది బాగా Suit అయింది.

ఊర్వ : [మధుతో] ఏం మధూ! నా వేషం ఎలావుంది?

మధు : అమోఘం! అద్భుతంగా వుంది. అసలు నన్నడిగితే-యీ నాటకం ముందు Shakespeare నాటకాలన్నీ బలదూర్!

రామా: Shakespeare కీ D. L. Roy కి పోలికేమిటిలే! D. L. Roy మొన్న మొన్నటివాడు గదూ!.... D. L. Roy యీ నాటకం ఏ సంవత్సరంలో వ్రాశాడో!

రఘు : ఏమోరా?....ఏమండీ కామరాజుగారూ?—

కామ : ఆఁ. ఆఁ. బహుశా యిదే అతని ఆఖరి రచనేమో!

రామా: అయితే చాలా ముసలితనంలో రాశాడన్నమాట. అందుకే అంత బాగుంది. బహుశా చావబోయేముందు రాశుంటాడు.

రఘు : లేక చచ్చిం తరువాతే రాశాడో!-[లేచి] ఆఁ. ఊర్వశీ! నీ వేషం విషయం కొద్దిగా నీతో మాట్లాడాలి.

ఊర్వ: ఆ. ఆఁ. తప్పకుండాను. అసలు నేనే అడగాలనుకుంటున్నా. మధూ! మీరు వెళ్ళి స్నానాలవీచేసి Ready గా వుండ రాదూ! అందరం కలసి Theatre కి వెళ్లొచ్చు.

మధు: }
రామా: } అలాగే [అని లేచి]-[కామరాజుతో]





రామా: మీ రెప్పుడూ ధీరోదాత్తనాయిక పాత్రలు వేశేవారు. యీ సారి యిలాటిది Select చేసుకున్నారేం?

మధు : దీనిలో Acting కి మంచి Scope వుంది. వారేం తెలివి తక్కువవారు కాదు. [అని యిద్దరూ కామరాజుకు Congrats. చెప్పి Shakehand యిచ్చి వెళ్ళిపోతారు.] [శివశంకరం కామరాజుతో 'Congratulations' అని Shakehand యిస్తాడు. పూర్వశికి గూడ Shakehand యివ్వబోయి, మళ్ళీ పొరపాటు సర్దుకొని, నమస్తే అని "Theatre దగ్గర కలుసు కుంటాను" అని వెకిలిగా నవ్వుతూ వెళ్ళిపోతాడు]

రఘు : [కామరాజుతో] చాలా బేజారయిపోయినట్టున్నారు!

కామ : ఎబ్బే! అదేంలేదండి! [అని రఘువైపు అదేపనిగా చూస్తాడు]

రఘు : అయితే మీరు నాటకం కాగానే 12 గంటలబండికి బయలు దేరడం ఖాయమేనా?

కామ : ఆ. ఆ. ఖాయమే!

రఘు : సామాను అదీ సర్దుకోవాలా?

కామ : అక్కర్లేదండి-మధ్యాన్నమే సర్దేశాను.... [లేచి] నేను వస్తానండి.

రఘు : ఏమంత తొందర?

కామ : ఏమీలేదు!—పోర్షను మళ్లీ ఒకసారి చూచుకుందామని. పాడు Dialogues—చాంతాడంత వున్నయ్—అయినా

మీకు మాత్రం ధన్యవాదాలు! సెలవు-[Exit]

ఊర్వ : మీరు మాత్రం మా ప్రాణాలు కాపాడారు. నాటకం రాయ డానికి చాలా శ్రమపడి వుంటారు.

రఘు : ఆ, ఏమి శ్రమగాని-అదుగో ఆ పండు దగ్గరే కొంచెం తికమక పెట్టింది. గుండ్రగా, నున్నగా, మెత్తగావుంది పరిమళం గూడా వున్న వస్తువులు యీ ప్రపంచంలో చాలా తక్కువ—చూడు.

ఊర్వ: [సిగ్గుతో] రాత్రి ఆయన నా బుజాన్ని చూచి వర్ణించారండి.

రఘు : ఓ అలాగా! నే నింకా నీ నొసలేమో అనుకున్నాను.

ఊర్వ : ఊఁ. పోండి. వయస్సు మళ్ళినా, మీకు పోకిరితనం పోలేదు.

రఘు : ఊ హూఁ. మిగతా వాళ్ళంతా పెద్దమనుషులూను-చివరికి నే నేమో పోకిరివాణ్ణి!-కాని ఒక్కవిషయానికి మటుకు నాకు నేనే గర్వపడుతున్నాను. నా నాటకరచనానైపు ణ్యంవల్ల మీ సంసారం నిలబెట్టగలిగాను. నాటక కళకి గొప్ప గౌరవం, ప్రయోజనం సంపాయించి పెట్టాను. పెనుతుఫానులో చిక్కుకున్న మీ ప్రేమ లతని రక్షించి, నిలబెట్టాను. ఆ లత క్రమంగా పెరిగి, పెద్దదై త్వరలో నాలుగు కాయలు కాస్తే, యీ కళ్ళతో చూచి, చచ్చిపోదా మని వుంది. [అని కొంటెగా చూస్తాడు]

ఊర్వ: [సిగ్గుతో] ఊఁ. [అని తల పక్కకి తిప్పుకుంటుంది]

రామూ : }
మధు : } [ప్రవేశించి] యింకా యిక్కడే వున్నారేం మీరు ?

రఘు : ఆ. మధూ—యిలా రా ! [మధు వస్తాడు. ఊర్వశి ప్రక్కన నిలబెట్టి—రఘు ఏదో ఆలోచిస్తున్నట్టు నటించి] ఆఁ, యిప్పుడే వస్తానుండండి.— [అని ద్వారంగుండా పోబోతూ రామానుజం చెయ్యిపట్టుకులాక్కెళ్ళి — ద్వారంవద్ద ఆగి తిరిగిచూచి— కొంటెగా దగుతాడు. మధు ఊర్వశి వెనక్కి తిరిగిచూచి, అర్థం చేసుకుని, ఒకళ్ళ మొఖంలోకి ఒకళ్లు చూచుకొని మెల్లగా నవ్వు కుంటారు.] [తెర]

—+—

